# పెళ్ళిళ్ళు

అది [illegible]గేండోయ్ !

"తాతా! తాతా! పెళ్ళిచేసుకుంటావా?" అంటే—"పిల్లనిస్తేవాళ్ళుంటే పెళ్ళాడక నాకేమ"నే తాతయ్యలను మనం తరచు చూస్తున్నాంకదండీ? పెళ్ళివేడుకలు జరిగేరోజుల్లో పెళ్ళికొడుకంటె తానో పిల్లజమీందార్ అన్నమాటె. మా రామయ్య కూతురు పెళ్ళికి యిరవైవేలు కర్చెట్టాడంటే మా రంగయ్య కొడుకు పెళ్ళికి ముప్పైవేలు కర్చెట్టాడనటం మన వాళ్లలో ఘరానా అయిపోయింది. ఈ పెళ్ళివైభవాలు స్థితిగల వారు స్థితిగలిగినట్లల్లా చేస్తుంటారు. స్థితిగలవారనటంకూడా మతిలేని మాటేలెండి. "పేరి పెళ్ళి యెంకి చావుకొచ్చింది" అన్నట్లు పెళ్ళికొడుకయితే యెంత కర్చెట్టినా యింకా పెదిమ యిరుస్తునే వుంటాడుకాని, పెళ్ళిపెద్దలకు మాత్రం తమ పెద్దలు తప్పకుండా కనుపిస్తారు.

మొదటిమాట పెళ్ళంటేనే అదో భోగదశ — పెళ్ళి యిల్లంటే భూతలస్వర్గం. చూడండి! పెళ్ళి కొన్నా[illegible]

ప్పట్నుంచీ అతనికి రోజూ తలంట్లే—ప్రతిరోజూ విందుభోజనాలె—ఎప్పుడూ నూతన వస్త్రధారణలె—పూట పూటా పారాయణాలె—అందరూ మరియాద లిచ్చేవారె. ఇక పెళ్ళినాడు వారికి కావలసిన చుట్టాలతో—యింటిపనివాళ్ళతో—పైకా లిచ్చి పుచ్చుకునేవాళ్ళతో యిల్లంతా నిండిపోతూంది. ఇంటి ముందు పందిళ్లు—గడపలకు పసుపులు—వాకిళ్ళకు తోరణాలు—గోడలకు సున్నాలు—రంగుకాగితాలు—అరటిచెట్లు వొకటేమిటి రకరకాలుగా రాణిస్తూంటుంది. ఓసైపు పలహారాలు వ్రాపి రాడకుండా జరుగుతుంటాయి. మరోసైపు మంచి నేతితో—ఘుమ ఘుమాయింపు తాలింపు కూరలతో—పిండివంటలతో—కమ్మపిండి, కందిపప్పు, గట్టిపెరుగు, గుమ్మడికాయ దప్పళాలతో భోజనాల పంక్తులు మిక్కుటంగా లేస్తుంటాయ్. తాంబూలం సేవించబోతూ సున్నంలో రాయివచ్చిందని కోపం తెచ్చుకొనేవారు—పులిహోరలో మిరపకాయలు పొడుగాటివి వేయకుంటే యింకా బాగుండేదని సమర్థించేవారు—పాటలుపాడే అమ్మాయి పాటకంటే పమిటచెంగు బాగుందని మెచ్చుకొనేవాళ్లు; యిలా ఆటలు—పాటలు—మాటలతో కోలాహలంగా వుంటుంది.

సరె— ఆ మూడు ముళ్లూ పడ్డాయనుకోండి; అలుక పాన్పులు—ఆడబిడ్డల పోటుమాటలు—చెండ్లాటలు—చెతురు మాటలు—వప్పగింతలు—వరుసపాటలు—బ్రహ్మముళ్లు వేయించటాలు—పేరులు చెప్పించటాలు—వదినామరదళ్ళ వంతు నెగ్గింపులు—బావా బావమరుదుల బడాయికబుర్లు—భాజా భజంత్రీలు—భోగంమేళాలతో యింకెందుకులెండి; యెంతైనా సరదాగా వుంటుంది.

తొలి నిద్రలు—మలు నిద్రలు తొంభై తొమ్మిదిరకాలు జరుగు తూంటాయి. ఇవి చాలాచోట్ల శుభకార్యాలనేపేరుతో ప్రారంభమై చివరకు క్షోభకార్యాలుగా ప్రత్యక్షమౌతాయి. అందుకే "పెళ్ళిచేసిచూడు, యిల్లుకట్టిచూడూ" అన్నారు పెద్దలు. ఆపెద్దలు యిప్పటివాళ్ళయితే పెళ్ళిచేసి చూడు-యిల్లు కట్టిచూడు-సినిమా తీయించిచూడు అని చెప్పేవారు. అసలు శుభకార్యమంటేనే పెళ్ళి అనుకొంటారు కొందరు. ఒకపెళ్ళి పూర్తిచేయుటమంటే వొక మహాయజ్ఞంచేసినంత ఘనౌతూంది. నిజానికి యజ్ఞంచేసినా యింతఖర్చూ, బాధా వుండదేమో! ఉంటే — మ.కోట్ల పులయిన విశ్వామిత్రాది దూర్వాసముని లెలా యజ్ఞయాగాలు చేసేవుంటారు చెప్పండి.

పూర్వంలో అంటే యిప్పటికి ముప్పై నలభై యేళ్లనాటి మాటని షుమారంచనా వేద్దాం. మగపిల్లకాయలకు పిల్లలవిషయంలోనే తల్లి తండ్రి తొందర పడుతూండేవాళ్లు. ఎక్కడనో వొకచోట వో సంబంధంచూచి "కులపింటికోతిపిల్ల యేపిల్ల యితేనేమిలెమ్మం"టూ గర్భాలున "శుభశ్య శీఘ్రం" అని ముడిపెట్టేవారు. పెళ్లీడునచ్చినా రాకపోయినా పెళ్లాంమాత్రం వచ్చేది. అంటే పెళ్లామింకా తల్లివద్ద పాలయిన మరిచిపోదు— పెనిమిటి గోచయినా పెట్టనేరడు.

ఒకవేళ యెవరయినావుండి "ఇదేమిటండీ; యిప్పుడు వీళ్ల పెళ్లికేం తొందరొచ్చింది? తలంబ్రాలయినా పోసుకొనే తాహతయినాలేదే! పిల్లలముందెట్టుకొని పెద్దవారా తలంబ్రాలు

పోసుకునేది ?" అని అడిగితే "చాలులేవయ్యా! బ్రహ్మచారి ముదిరినా, బెండకాయ ముదిరినా పనికిరాదంటారు పూర్వులని సమర్ధిస్తాడా యింటికైన యజమాని. వెంటనే యింటి యిల్లాలు వచ్చి కాదటండీ! బొమ్మల పెళ్ళిలా యెంతో వేడుకగావుంటే, యిప్పుడెందుకంటా రేమండీ? ముద్దూ ముచ్చట చూచుకొనే రోజుల్లో వూరుకొంటే ముసిలాళ్లయ్యాకనటండీ పెళ్ళిళ్లు, పేరంటాలున్నూ అంటుంది.

అందుకు మరికొన్ని కారణాలున్నాయి. ఈ పెళ్ళిళ్లలో ఒక విచిత్ర సమస్యవుంది. దాన్నిగురించి చెప్పటానికో కథ చెప్పాలిసొస్తుంది. ఓ గ్రామంలో కల యింటి కనకమ్మ పొరుగింటి పున్నమ్మ అనే వదినా అడుబిడ్డలున్నారు. ఓనాడు వారిద్దరిలా మాట్లాడుకొన్నారు. ఏమనంటే ?—

"నా బంగారుకొండ, నా వరహాలతండ్రీ! నా ముద్దుల మూటా!"యని కొడుకు చెక్కిళ్లమీదుగా తన రెండుచేతులు జారదీసి కణతలకుబెట్టి, మెటికలు విరుచుకుంటున్న కనకమ్మకు తెలియకుండానే పున్నమ్మ వచ్చి వెనుకగా నిలుచుండి మీ అబ్బాయి పేరెన్నిసార్లువిన్నా మరిచిపోతున్నానని పున్నమ్మ అంటే "శ్యామసుందర మదనమోహన రాధాకృష్ణమూర్తిఅని కనకమ్మ సమాధానంచెప్పింది. చూచావా మీ అబ్బాయి పేరెంత పెద్దదో? " అన్నట్లు అదో మోస్తరుగా చూస్తూ.—

అంత పొడవుపేరు నాకు రాదమ్మా! 'కృష్ణా' యని

పిలుస్తాను, ఏమిరా కృష్ణా, పలుకవూ? ఏకృష్ణుడివినీవు?అల్లరి కృష్ణుడివా? ఆనందకృష్ణుడివా? రాధా కృష్ణుడివా? రాజా కృష్ణుడివా? చెప్పూ-యేకృష్ణుడివో చెప్పూ. చెప్పవేం? ఓయబ్బో, నీవేనాకృష్ణుడివి?—నిన్నేనా పిలిచేది?- గొల్లయిళ్ళలోదూరి పాలూ పెరుగు త్రాగిన దొంగవు నీవేనా? యాదవాంగనల మూతులకూ, బుగ్గలకూమీగడపూసిపోయినపోకిరివినీవేనా?- గోపికల చీరలెత్తుకుపోయి చెట్లెక్కిన చిలిపివి నీవేనా? ఓరి భడవా! నవ్వుతున్నావా? అమ్మదొంగా; నవ్వు-మళ్ళీ నవ్వు- ఏమిటానవ్వు? ఛీపో! అయ్యయ్యో యేడుపు మొదలెట్టావెం దుకూ? ఇలారా! మానాన్నకదూ? మాఅమ్మకదూ? మా బంగా రంకదూ? ఏడువకు-నాన్నా! యేడువకు—చూడూ! నేనత్త మ్మనుకదూ? నామాటవినవూ? ఏడువకు రా, నేనుచచ్చిపోనూ- నేను పాడయిపోనూ-నేనుదుమ్మయిపోనూ-నేను ధూళీమటమై పోరు- నానోరు పడిపోనూ-నాచేతు లిరిగిపోనూ-నవ్వుతూన్న వాడి నేడిపించానమ్మా! నానవ్వు నల్లబొగ్గులయితే-నాసరసం చట్టుబండలయితే- నాముద్దు ముక్కలయితే- కృష్ణా! వెన్న బెట్టనా? గజ్జెలు కట్టనా? అరరె...అదికాదురా! అమ్మాయి నిస్తానుకాని ఆగంచేయకు...చూచేవా వదినా! అమ్మాయి నిస్తాననంగానే అమాంతంగా యేడుపాపివేశాడో అని నవ్వుకుం టుంది పున్నమ్మ.

"అదిసరేనమ్మా! నీకింకా కూతురు పుట్టనూలేదు— మీ అన్నయ్యగారు వెళ్ళి మా అన్నయ్యగారినింకా అడగనూ లేదు—మా అబ్బాయికి మీ అమ్మాయినిస్తామని మీారనా

లేదు; అడగటాలూ లేవు—ఆమోదాలు లేవు; మాటలూ లేవు-మూటలూ లేవు-రాకపోకలూ లేవు — రాయబారాలూ లేవు; కట్నాలూ లేవు-కానుకలూ లేవు, ఏమీ లేకముందే యింతగా ముచ్చటబడి ఆ గారిపై అబుడంటె రకరకాల పేరులు పెట్టి రాణింపుగా పిలుచుకొంటున్నావమ్మా వదినగారూ!" అంటూ పదవత్సరమయినా సరిగా నిండీనిండని కుమారుని పెళ్ళికొరకై; ఆమెకు పుట్టబోయే పిల్ల, యీమెకు కాబోయే కోడలన్నట్లుగా రేపేదయినా లాంఛనాలలో "మాయింటలేద"ని పడతి పేచీ పెట్టకుండా జాగ్రత్తగా మాట్లాడటం మొదలెట్టింది కనకమ్మ.

"అయినా కాలమింతవింతగా మారిపోయిందేమమ్మా! అంటే అనకూడదుకాని, యీకాలపు పేరులు వింటూంటే— మొన్న నాటకంలో ఆ అబ్బాయి చెప్పాడె — ఆమాటలు గుర్తుకొస్తున్నాయి, ఓరి నీపిల్లాడు పిసికెయ్య'నిన్న మొన్నటివా! డేమి మాటలు నేరిచాడు? - ఏమిచేతులు తిప్పాడు? - ఏమి మూతి విరిచాడు? - ఏమి ముక్కు విరిచాడు" అంటూ విడ్డూరంగా నోటిమీద చెయ్యేసుకుంది పున్నమ్మ.

"ఏం చెప్పాడే" అని అడిగింది కనకమ్మ.

"ఏం చెప్పేదేముందే? వెనుకటి పేరులు మంచి మంచి పేరులు—మరియాదగల పేరులు— తెలివిగల పేరులు - దేవతల పేరులట. ఈ కాలపు పేరులు, వింతవింత పేరులు— విపరీతపు పేరులు—నడమంతరపు పేరులు—నాజూకు పేరులట. పూర్వ కాలంలో మగపిల్లలకు రామయ్య, రంగయ్య శివయ్య శంకర

య్య, అనే దేవతలపేర్లు పెట్టుకొందురట. ఈకాలంలో చాలా మందికి చిక్కడు, దక్కడు, బతకడు, అబద్ధాలు హుళక్కి, దైవాధీనం పరాధీనంలాంటి పేర్లు, ఇందులో రామారావు, రంగారావు అనే మంచిపేర్లుకూడా వున్నాయట అయితే వాటికి బదులుగా గంగారావు, రానేరావు, పోనేపోవు అసలే లేవనేపేర్లు తయారయ్యాయట.

ఆఁ- మరచిపోయాను. నా తెలివి తెల్లవారినట్లేవుంది. ఆడపిల్లలపేర్లు చెప్పొద్దూమరి? ఆరోజుల్లోవృట్టే ఆడపిల్లలకు సీతమ్మ, జానికమ్మ, సావిత్రమ్మలాంటి దేవతాస్త్రీల పేర్లు పెట్టుకుంటే, మొరటుగా నున్నాయని, యీరోజుల్లో చాలా మంది విశాలాక్షి, కమలాక్షి, పెద్దవక్షి, గుడ్లపక్షి, హైమావతి, అదేగతి, సుబ్బులు గబ్బులు, మల్లెమొగ్గ, చింతపూతగా మారారం''టూ ఓ చిరునవ్వునవ్వి పెదిమ విరిచింది పున్నమ్మ.

''తానీ''యని పున్నమ్మ అంటే "తంధానీ''యతీ మరో యక్షరం యెక్కువగా అనకపోతే కనకమ్మ కాబోయే యీావ గాలిముందు తగ్గిపోతుంది సుమండీ! అందుకేనేమో వెంటనే అనుపల్లవి అందుకుంది కనకమ్మ, "అపుడపుడూ మీా అన్నయ్యగారుకూడా తమాషాగా అంటూంటారు, ఒక పెరులమాటే కాదు. అప్పటికీ యిప్పటికి యెన్నో మార్పులున్నాయట— వాళ్ళకు ముచ్చటముళ్ళ గిరజాలు పిలకలూ వుండేవట— వీళ్ళకు యెగ్రదువ్వ క్రాపులు, యెదురుబోడి క్రాపులు రూళ్ళ కఱ్ఱ క్రాపులు, రోలింగు క్రాపులు, చిన్నక్రాపులు, పెద్దకాపు

లుగా మారాయట ఆనాటివారు లాల్చీమెడనట్టీలు కంటె మెడపట్టీ చొక్కాలు తొడిగేవారట. ఈనాటివారంతా మారి పోయి; టెన్నీసుకాలరట—పోలరుకాలరట - బేబీకాలరట - కట్టైనాకాలరట—కంపనాకాలరట,

పైగా కంటికీ కాలికి జోడులట—
బుగ్గకూ, మూతికీ బీడీలట—

అదీగాక తలమీద హ్యాట్-వంటిమీద కోటు - దాని కింద సూటు-కాలికి బూటు-చేతికి లైటు-సాగితేసీటు- చాలక పోతేలోటు-మరిచిపోతే పొరపాటు-అయితే అలవాటు-కాక పోతేగ్రహపాటు—యీపాటులన్నింటినీ మించినపాటు మిడిసి పాటు. నడమింటవారికే నగుబాటు.

ఇంకాచూస్తే బుజ్జిమీసాలకుమారు బుడ్డబుడుచుమీ సాలట—కోరనూసాపకుమారు కొతిమీర మీసాసట- సాఫు మీసాలకుమారు సగంమీసాల"ట.

అలా కనకమ్మ దండకం ముగించగానే "అవులా మించి పోయావే అబ్బాయితల్లీ!" అన్నట్టుగా వున్నమ్మ మళ్ళీ ప్రారం భించింది, "వదినా! నీవు మగవాళ్ళమాట చెప్పేవుకదా? నేనా డంగులమాట చెప్తాను వినమ"న్నది. "నడినెత్తినకొప్పు— ముడిజారితేతప్పు—పూలుపోయి పిన్ను- పూలుపోయిరిబ్బను, పంజాబ్ బాడీ-పదిఅంగుళాలపైట- కళ్ళజోడులొచ్చాయికాబట్టి

కాటుకపనిలేదు—తిలకంసీసాలకు డిమాండువచ్చి కుంకుమడబ్బాలు కూలిపోయాయి—ఆకుచెప్పులాచరణకాబట్టి పసుపుపారాయణాలు పలాయనం. ఈ వేషాలు, విశేషాలుచూస్తే నల్లవాళ్లూ కారట — తెల్లవాళ్లూకారట. ఆడా కాదట—మగా కాదట.

మళ్ళీ సొమ్ములు చీరెలమాటకొస్తే 'అ'బేసరి 'ఇ'బేసరి '(శ్రీ)'బేసరి 'చీ'బేసరి చిలకబేసరి, కాకిబేసరి, జల్లెబేసరి, జాతరబేసరీ లొచ్చాయట. నాగరాజుగళ్లట — మాలపిల్ల చీరెలట — దీక్ష చీరెలట — దెయ్యం చీరెలట. ఐస్‌క్రీం గాజులట — అర్ధాయవు గాజులట — బర్మా ముడులట — సిలోను కటింగట — చెప్పతరం కాదట.

కాలం ఆడవాటిలోనూ మగవాటిలోనూ చాలా మారిపోయిందట. కాఫీ త్రాగితే కనకవర్షం కురిసినట్లు — సినిమా చూస్తే శ్రీరంగం చూచినట్లు"—

అని అంటూండగా వుయ్యాల్లోనున్న బాలు డేడ్వసాగాడు. "చిచ్చీచిఅయిూ, అబ్బాయి మేనత్తలకు బుద్దేలేదూ?" అంటూ జోలపాడింది కనకమ్మ.

"అబ్బాయి మేనత్తలకు కాదు – అబ్బాయి మేనమామలకు బుద్దేలలేదూ?" అని సమర్థించింది పున్నమ్మ.

"మేనత్తలకే?"నని వొత్తి పలికింది కనకమ్మ.

"అబ్బో; అన్నలన్నామని రోషంతో రోలు మెడకు కట్టుకొచ్చిందిరా, కృష్ణా! మాయమ్మ" అన్నది పున్నమ్మ.

అయితేమాత్రం మీ కాడపిల్ల పుట్టినా మాకిచ్చేవాళ్ళు న్నారటలే" అని విరక్తి చెందింది కనకమ్మ, అంతలోనే అది ప్రసూతి వైరాగ్యమో!— పురాణ వైరాగ్యమో, మరి!—

"మాలాంటి పేదవారిపిల్లను మీరు చేసుకొంటారటలే" అని పున్నమ్మ బదులుచెప్పింది. ఆ రెండు వైరాగ్యాలు కావు, మూడోది స్మశాన వైరాగ్య మన్నట్టుగా.

"చిన్నవాడు తూగినన్ని రూపాయలిస్తే, చిన్నదానిని చేసుకుంటాము"న్నది కనకమ్మ. యెవరిమీద దయో!

"మా నెడు రూపాయలిస్తే మా పిల్ల నిస్తాము"న్నది. పున్నమ్మ — తానాడ పిల్లను కనాలేకాని, మా నెడు రూపాయల కమ్మలేక పోతానా" అని కామోలు.

ఇంతలో దీపాలు వెలిగించారు. ఎవరి యిండ్లకువారు చేరుకొన్నారు. ఇలావుంటాయి మనవారి వ్యవహారాలు. పుట్ట బోయేది ఆడపిల్లో మగపిల్లాడో తెలియకుండానే మనాడవారి ముచ్చట్లింతదాకా వొచ్చాయిగదా! పుట్టినతర్వాత యింకెంత సరదాపడతారో చూడండి. నా మేనల్లుడికే యిచ్చి చెయ్యా లంటాడాయన — నా తమ్ముడికే యిచ్చి మేనరికం చేద్దామం టుందా బిడ. వీరివీరిపట్టు నెగ్గింపులేకాని వధూవరుల యిష్టంతో యెవరికీ పనిలేదాయె! పెళ్ళి చేసుకొనేవాళ్ళే పెద్దవారైతే తల్లి [illegible] యిష్టాలు తప్పకుండా సాగుతాయని యెలాచెప్పడం! [illegible]వొచ్చు—అంగీకరించక పోవచ్చు. క్రొత్తచుట్టరికం

కూరిమి గలదంటూ పాత చుట్టరికం పనికిరాదనేవారిని మనం తరచు చూస్తున్నాంకదా?

అదీకాక మహమ్మదీయ పరిపాలనా కాలమందు జరిగిన పరిస్థితులను బట్టికూడా బాల్య వివాహాలు చేయవలసి వచ్చిందామె. "అష్టవర్షాత్ భవేత్ కన్య" అని యెనిమిది వత్సరాలు రాకపూర్వమే వివాహము గావించుట భారతీయ ధర్మమని మహమ్మదీయ పాలనావి శారదా చట్టారంభం వరకూ జరుగుతూ వచ్చింది. అలాకాక పెళ్ళికి పూర్వమె కన్య రజస్వలా అయినచో నదియొక మహా భయంకర దుస్సహ దురంత పాపమనియు, ఆ పాపపిశాచం కన్యయొక్క మాతృ పితృ కుటుంబాలలో యేడుతరములవారి వరకూ వ్యాపిస్తూందనీ యింకా యేమేమో కల్పించినందున కుటుంబ యజమాని కొద్ది కాలంలో పెళ్ళి తప్పక చేయవలసినవాడై, ఆవేదనపడి, ప్రయాసపడి, అయినవారినికూడా కలుపుకోక, సరియైన సంబంధం కుదిరించుకొనేటప్పటికి యేడుజతల చెప్పులు తెగేవి అనంటారు.

అయినసంబంధం అందివస్తే సరేననుకోండి. అటుగాక— వరాన్వేషణో, వధూనిర్ణయమో కావాలంటే "గోత్రం కుదిరిందిరా గోపన్నా!" అంటే "సూత్రం కుదరలేదురా సూరన్నా" అంటారు. ఓ వేళ గోత్రం, సూత్రం గొడవ పెట్టక పోయినా, ప్రవరమాత్రం పక్కా పేచీపెడుతూంది. కర్మంచాలక యీవన్నీ కలిసొచ్చినా అల్లుడి కట్నాలలోనో; ఆడపిల్లల మరియాదల లోనో; ముత్తవ్వ పుట్టాలదగ్గరో; మొండికా లడ్డ మొచ్చి మరి

సొచ్చినదాన్ని కాస్తా ముక్కచెక్కలు చేస్తారు. శాస్త్రసమ్మతి వివాహమంటూ శాస్త్రమంటే యేమిటో తెలుసుకోకుండా చివరకంతా శాస్త్ర విరుద్ధంగా పూర్తిచేస్తుంటారు.

కట్నాలూ, లాంచనాల మాటకొస్తే మటుకు యిప్పటి కంటే అప్పుడు కొంతమేలేనని చెప్పాలి. ఏదో యితర వారికి తెలియకుండా అనుకోవడం — అనుకొన్నట్లు చాలాచోట్ల జరిగిపోవడమేకాని యిప్పటి మాదిరిగా మడతపేచీలతో తాడు తెగే వ్యాపార ముండేదికాదు.

అయితే పెళ్లిళ్ళకుపెట్టే కర్చుమాత్రం "అయ్యవారలావ గింజంత తలగుడ్డ తాటికాయంత" అన్నట్టు లుంటుంది. అసలు కర్చుకంటే అనవసరపుకర్చులే అదనంగా వుంటాయి. ఒకరోజు పెళ్లి—మూడురోజుల పెళ్లి—అయిదురోజుల పెళ్లి అంటూ చేస్తుంటారు. వచ్చినచుట్టాలుకూడా యిదేసమయమని చిక్కిన ఛాన్సు పోకుండా అల్లుడుకంటె యెక్కువగా అట్టహాసం వేసు కొని కూరుచుంటారు. మూడునిద్రలు — మలునిద్రలు — పద హారురోజుల పండగలు వెళ్లిపోయినా వచ్చిన చుట్టాలుమట్టుకు వెళ్లిపోరు. "పప్పన్నమంటే పదామడలైనా" పొమ్మని పెద్దలం టారని వీరి విశ్వాసమేమో!— ఇక తప్పదురాబాబూ అంటూ యింటిమొగం పెట్టితే కొత్తగా కోడరికానికొచ్చే కోడలే పది రోజ్లో మేలనిపిస్తూంది. కాదటండీమరి!— ఇంటికిపోతే పప్పూ పుప్పూ మళ్లీ వెతుక్కోవాలాయె, యిలా తేరతిండి వెంటనే వొలకొద్దూ! వీరికి పూటపూటా పప్పు దప్పళాలు తెచ్చిపెట్ట

లేక యజమాని నిలువునా నీల్గిచస్తేమాత్రం దిగులేమిటంటాను? అసలు దిగులెందుకు పడాలి? ఆనారాయణమూర్తి దయయుండి అలా జరగాలేకాని; జరిగితే — యీ పెళ్ళిభోజనాలతోపాటే ఆ పిండ ప్రధానాలుకూడా పట్టిపోనటం మళ్ళీ మళ్ళీ ప్రయాణ ప్రయాసలుండవని తలుస్తారేమోనని నేం తలుస్తున్నాం. అందుకో సామ్యశ్యంచూడండీ! ఓ యింటికివచ్చినచుట్టం యెన్నాళ్లకూ పోకపోతే యింటి యజమాని గభాలున అనలేక శ్లాక్యంగా "ఏమండీ తమరిక్కడకు దయచేసి చాలాకాలమైంది యింటివద్ద మీ భార్యాపిల్లలు మీకోసమై యెదురుచూస్తున్నారేమో"నని అంటే ఆవచ్చినచుట్టం "మరేమీ ఫరవాలేదు, కాస్తముక్కవుంటే యిలాపారేయండి, వుత్తరంవ్రాసి వాళ్ళనుకూడా యిక్కడకే పిలిపిస్తా నన్నా"డట.

"అయితే మరొకరింటికి పోయినప్పుడీ యజమానయినా అంతేనా?" అని మీరడుగుతారేమో? ఆయనేకాదు — మేమే కాదు ఆఖరుకు మీరేకానివ్వండి. పొరుగింటి కష్ట సుఖాలు పూచికపుల్లంతయినా తెలిసికోనలేనివాళ్లు— అథవా తెలిసినా "లౌక్యం" అంటే లేనివాళ్లంతా యింతే.

"జామాతా దశమగ్రహః" అనినట్లు పదియవ గ్రహమైన అల్లుణ్ణి ఆతనికి సంబంధించిన యీ యుపగ్రహాలనూ శాంతి పరచి పంపించిన మరునాటినుండీ యజమాని గుండెల్లో రైళ్లు పరుగెత్తుతాయ్! బండలు పగులుతాయ్! సముద్రాలు పొంగుతాయ్! ఆపాదమస్తకమూ సీతలమ్మగమ్మి తులసినీళ్ళవరకూ

వస్తూంది వ్యాపారం. ఇంతలో ఏ యింటిపనివాడు మామూలుకో? — ఏ పందిళ్లుపీకించే పనిభార మొ? — ఏ బాకీదారుని పోటుమాటలో నిప్పు కణికల్లా తగిలి కాస్త వృష్ణం కలిగించినా మనోవ్యాధి మాత్రం మంచాని కొప్పగిస్తుంది.

అంతకష్ట మేమొచ్చిం దంటారేమో —— అలా తేలిగ్గా అంటే యెలా చెప్పండి. వచ్చినచుట్టాలను వెళ్ళమనట మంత సులభమా? "మా చేయు చందన తాంబూలాది" అని శుభలేఖలు వేయిస్తే అందులో భోజన ప్రస్తావన లేదుగా! "వేగ దీవించి యింటికి వెళ్లవలయు"నన్నా దీవించవలసిన సమయానికి ప్రత్యక్షులుగూడా పరోక్షాన్ని దలంచి తప్పకుండా గైర్‌హాజరై చదివింపుల లీస్టులో జీరో మార్కు కొట్టేయటం; భోజన వలహార కార్యక్రమాల్లో రెగ్యులర్ అటెన్‌డెన్సు యిస్తూ పరసెంటేజీకి లోటు రానీయకుండటానికి కంపల్‌సరీ వర్కింగ్ కమిటీ కేర్‌ఫుల్‌గా ప్రవర్తిస్తూంది. యీ కంపల్‌స్తరితోనే కొంపలు సరిఅవుతున్నాయి. ఆహ్వాన పత్రికల్లో వుంటుంది కదటండీ! "బంధుమిత్ర పరివారంబులతోసహా" నని—— అందులో పొరపాటురాకుండా "తనవెంటన్ సిరి, లచ్చివెంట నవరోధవ్రాతముల్"అన్న పోతనామాత్యుని గుర్తుకు తెస్తారు.

అలాంటి వుదర పరాయణులు, భోజనప్రియు లున్నారనటం మరీ సీరియస్‌గా మాటాడుతున్నా మంటారేమో? కాదుబాబూ కాదు. మాకంటె సీరియస్ వుదర పోషణార్థం బుభుక్షితవేషం అనేవారిని మన మెంతమందిని చూస్తున్నామం

టారు? "కరోది బ్రాహ్మణా మృష్టభోజనా" అనే ప్రత్యేకత గలవారున్నారు. కొంతమంది కుఱ్ఱాళ్లొకాయనచుట్టూ మూగి "మీకు దంచయ్యని నామమెలా సార్థకమయిందండీ" అంటూ అడుగగా — వారు మరేమీలేదోయ్! ఇదివరలో అనగా నడి వయస్సులోనుండగా పప్పు నేను కొంచెమదనంగా పుచ్చుకొనే వాణ్ణి అందువలన పప్పు దంచయ్యా! అనేవారు. నాకు మా తల్లి దండ్రులుచేసిన నామకరణంపోయి పప్పులోభించి దంచు— అయ్యమీదికి పరంబయి "దంచయ్య"నయ్యాను. ఇప్పుడంతగా తినలేను. మూడరసోలల కందిబేడల పప్పయితే నాకు మోయ నంగా సరిపోతుందన్నాట్ట. పప్పు వండటానికే మూడరసోలల కందిబేడ లవసరమైతే తక్కిన సామగ్రి యెంతకావాలో లెక్క తేల్చుండి చూద్దాం. ఆఖర్చుతో సామాన్య కుటుంబమైతే ఓ మాదిరి పండుగకే సరిపోతుంది. కాదంటారా? మాటవరసగా అన్నాం. మరేమీ అనుకోకండి. ఓ చుట్టం వచ్చాడనుకొనే వాళ్ళం, యింకా నలుగురు చుట్టాలొచ్చారనుకొంటాం అంతేగా?

ఉఫే! ఉఫే! పాదరక్ష లెక్కడున్నాయో చూడవే! అని ఓ సోమయాజులవారంటే — వారిభార్య "నక్షత్రమండలాన యెక్కడా కనబడటంలేదండీ!" అన్నదట. ఆతరువాత పాదరక్ష లుండేది నక్షత్రమండలానకాదే భూమండలంమీద చూడవే అంటే "మీకంటే తక్కువ తినిచచ్చిందెవరు మెడ వంగటాని" కన్నదట శ్రీవారి ధర్మపత్ని సోమిదేవరమ్మాళ్ గారు. వారిద్దరినీ చూచి మరొకాయన "అదేమిటండీ! అతిభోజనంచేసి ఆయాస

పడకపోతే కాస్త కనిపెట్టి లేవగూడదా'' అని అడిగితే, అన్నం పరబ్రహ్మ స్వరూపంనాయనా! అన్నపూర్ణాదేవిని త్రోసి వెయ్యవచ్చునా? అని సమాధాన మిచ్చింది. పోనియ్యండి నాలుగావాలు నవలండీ! అంటే "ఆ సలహా నాకూ తెలుసు. ఆపాటి సందేహంటే ఆయబొబ్బట్లు పట్టించేవాడినని శాస్త్రిలవారి సమాధానం" ఇదంతాచూచినా యింకో మహాత్ముడు భోజనానంతరమున "అమృతావిధాన మసి'' అంటానికే శక్తి లేక గిజగిజలాడుతూంటే పీటమీదనుండి లేవట మాయన కాపూట పూర్తయిందికాదు. అలా నానా రసాభ చేయగా మిగిలిన నాలు గెంగిలిమెతుకు లున్నాయనుకోండి — వాటినయినా గడప ముందు కాచుకొన్నవాడిముందు వేయకుండా నుయ్యిదెబ్బల మీద నష్టపెట్టడమే కాబోలు అన్నపూర్ణతల్లిని గౌరవించడం?

చాలామందాడ వారికీ చాదస్తం వుందిలెండి. ఒద్దో మొఱ్ఱో యన్నకొలది వడ్డించడం మనవారిలో మరియాద. కొద్దిగా తినేవాడయినా కుంభంపోసినట్లు పెట్టాలిసిందే. మితిగా తినేవాడికి మిర్రిగుడ్లు పడుతాయి. ఇక చూడండీ! యెలావుంటుందో. పారేద్దామా అంటే పాపంవచ్చి పైనబడుతూందట— తినిలేద్దామా అంటే ఆతిప్పలు పెరుమాళ్ళ కెరుక. భోంచేసే వాళ్లెంత బాధపడితే వడ్డించేవారంత తృప్తిపడతారు. మరియాదధి మహాక లక్షణమేమో?

మరియాదలని, మన్ననలని వీరలిలా చేస్తుంటే యీ పెళ్ళివాచుట్టాలుమాత్రం తినమరిగినకొద్దీ యిల్లుయెక్కి కూసిం

దన్న సామెత నెందుకు జ్ఞాపకం చేయరు? ఎట్టకేలకు — తుట్ట
తుదకు, బయలుదేరిన చుట్టాలు మరిమరీ యజమానితో
వెళ్లాలి, వెళ్తాము, వెళ్లుతున్నామని చెప్ప మొదలెడతారు.
ముందు కొన్నిసార్లు ప్రయాణ మవటమేకాని పోవటం మాత్రం
జరుగదు. అంచేత ప్రయాణ మబద్ధం — ప్రసాదం నిబద్ధమవు
తూంది. చివరకదీ మించిపోయి బ్రతికననుకొన్న రోగి వప్ప
గింతలు చెప్పినట్లుగా ప్రయాణకాలానికి ముందుగా బయలుదేరి,
చిన్నా పెద్దలకు — ఆడా మగలకు — ఇరుగు పొరుగువారికి చెప్ప
టం ముగిస్తుంటాడు.

యీ బంధువు నాటకమిలా వుంటుంటే యింటి యజ
మాని పెళ్ళయేక నట్టింట నిలుచుని—నడుమున చేతులెట్టుకొని,
“అబ్బా! ఆ నాలుగక్షింతలూ తలమీద పడ్డాయిలే యంటూ
యే చింపిరి చాపమీదనో పడి కనుమూసినవా డమాంతంగా
లేచి, పెళ్లికొడుకునెత్తిన నాలుగు గింజలు పడటమలావుంచి
ముందు పెళ్లిపెద్ద నెత్తిన నాలుగు బండలు పడ్డాయిరా దేవుడా
అనుకుంటూ, గుడ్డో గోచో వారికి సమర్పించి — ప్రయాణం
చేసి — మళ్లీ రాబోకు మాయింటి కన్నట్టుగా పొలిమేరదాటిం
దాకా సాగనంపొస్తాడు.

ఆపైన మరో వారము రోజులదాకానయినా చాకళ్లు,
మంగలీలు, భజంత్రీలు, పనివారు వీరందరికంటె ముందుగా
పౌరోహితులవారు అంటే వశిష్టులవారు యమదర్శన మిస్తుం
టారు. “అర్జున ఫల్గుణ కిరీటి స్వేతవాహనా!” అనుకొంటూ

ఎలాగో యీ పిడుగులలోనుంచి చావుదప్పి కన్నులొట్టబోయి బతికి బైటపడతాడు.

దైవికంగా శారదాచట్ట మమలులోకొచ్చింది. శారదా దేవి పుణ్యమా అంటూ యిదిచాలావరకు సహకరించినా సనాతన పరులకుమాత్రం ససేమిరా గిట్టలేదు. ఎలాగిట్టుతుందిమరి? సంఘం వొకటుందాయె? సందర్భాలోచనలు లేకపోయినా సాధన ప్రజ్ఞకలది. ఆ సంఘానికి ఆక్షేపణే తెలుస్తుంది కాని, ఆలోచన తెలీదు. అలాంటి సంఘాన్ని అమాంతంగా తృణీకరించొద్దూ? సంఘమంటె సామాన్యమైందా? సంఘ పెద్దలంటే సామాన్యమైనవారా? శ్రాద్ధపు భోక్తలకు సమాధానం చెప్పడంకంటె సంఘ పెద్దలకు సమాధానం చెప్పటం ప్రళయాకారం దాల్చి ప్రాణాలు తీస్తుంది.

ఇక చూచుకోండి బాబూ! ఈ తమాషా! గోడదెబ్బ చెంపదెబ్బ తినాలిసొచ్చింది. ప్రభుత్వచట్ట మోవైపు పరవళ్లు త్రొక్కుతూంది. సంఘ మోవైపు సమ్మెచేస్తుంది. రాజాధికారప్రకారంగా రజస్వలానంతర వివాహమంటే — కావలసినవాళ్ళంతా కారాలు నూరుతున్నారు. బంధువుల యిష్టానుసారంగా బాల్య వివాహమంటే రాజశాసన మోవంక రాళ్లురువ్వుతూంది. అదీకాక తరతరాలాదిగా వంటబట్టిన యీ సమస్య తెంచివేయటం వొక్కరోజుపనా?

అంచేత ముఖ్యమైనవారికి మాత్రం తెలియజేసుకొని — [illegible] మహాశయులకి తెలియకుండా — ఆ మహాను

ముళ్లూ వేసుకొని — గప్‌చుప్ సంబారుబుడ్డీ అన్నట్టుగా యింటి
కొచ్చి కదలకుండా కూర్చుంటారు. ఈలాంటి సమయాల్లో
విరోధు లెవరైనా గవర్నమెంటుకు తెలియజేస్తేమట్టుకు వధూ
వరుల గృహప్రవేశంకంటె ముందుగా కృష్ణ జన్మస్థాన ప్రవేశ
మవుతుంది. అపుడీ మహాభాగ్యమీ నూతన వధూ వరులకే
కాకుండా వుభయ పక్షాలవారికిన్నీ; భజంత్రీలకు — బంధువు
లకు — పైగా పావులా డబ్బులకోసం వచ్చిన పౌరోహితుడికి
కూడా నిప్పు ముట్టుకొన్న సురేకారంలా వద్దురాబాబనేకొందీ
వొదిలిపెట్టకుండా అంటితీరుతూంది. కావున ధైర్యంబు విలో
లంబయి—యేడుకొండలవాడిమీద యీ భారమంతా వేసిగాని,
సత్యనారాయణవ్రతమనే పేరుతోగాని యీ పనులు నిర్గించా
రంటే నిజంగా వమ్మండి.

శారదా చట్టం వచ్చిందనంగానే జంధ్యాలవగ్గం చేసిన
జాతర అంతా యింతాకాదు. ఆరోజుల్లో అదో గమ్మత్తుగా
పెళ్లిళ్లు జరిగాయి. కొందరికి పందిళ్లులేవు — కొందరి గోడలకు
సున్నాలులేవు — కొందరికి మంత్రాలుకూడా దొరకకపోతే
మరేవరివయినా మెరువు తెచ్చుకొన్నారా అన్నంతగా సందే
హాన్ని కలిగించింది. మొత్తానికి పెళ్లికొడుకూ పెళ్లికూతురూ
వుంటేసరి. చేతురని మీరు నమ్మకపోతే మేంచేసేదిలేదుకాని,
పదకుండునెలల పిల్లకా హడావుడిలో పెళ్లిచేశారట అంటూ
అమ్మలక్కలంతా ముక్కుమీద వ్రేళ్లెట్టుకొన్నారు.

రాజా రాంమోహన్‌రాయ్ రాద్ధాంతాలతో నేమి —

వీరేశలింగంగారి వివాదాలతోనేమి సహగమనం సమసి పోయింది. తరువాత శారదాదేవిగారి సాధనతో బాల్యవివాహ నిరసనచట్టం బహిరంగమైంది. దానితో లోకానికి వెంటనే మేలు కలుగుతూందని తలచాం కాని, కొంత కీడుకలిగించింది. బిల్లు వస్తుందనే భీతిచేత పురిటిబిడ్డలకే పుస్తెలు కట్టించేశారు. తత్ఫలితంగా చాలామంది బాలికలు వయసుకంటేముందు వైధవ్యాన్ని పొందారు.

అతి బాల వితంతువయిన ఓ అమ్మాయికి సహజ యవ్వనప్రాయం వచ్చింది. తనతో నాట పాటలకొచ్చే పిల్లలందరిలాగా తనకు వాళ్ళమ్మ జడలల్లేదికాదు — పూలుపెట్టేది కాదు — చివరకింత బొట్టుపెట్టుకొన్నా "వద్దుతల్లీ! తుడిసెయ్యి"మనేది. కొన్నాళ్ళకు పుష్పవతి అయింది. తల్లి కంటి నీరు దుఃఖభాష్పాలో; ఆనందభాష్పాలో తెలుసుకోలేక పోయింది. అందరిలాగా వాళ్ళ పెద్ద లామెకు వేడుకలు చేయ లేదు — అందరి పిల్లలకుమల్లె "గాజులు వేయించుకుంటానే అమ్మా" అంటే తల్లిదండ్రులు కన్నీరు నింపుకొని మాటాడే వారుకారు. ఇరుగు పొరుగిండ్లకుమల్లె తమయింటికి కామెను గూర్చి సంబంధాలు రావటంలేదు — ఎన్నాళ్లున్నా తమయింటిలో పెళ్ళినిగూర్చి ముచ్చటలులేవు. ప్రక్కిండ్లలో శుభకార్యాలవల్ల నెంతో సంతోషంగా పోయేది కాని, వాళ్ళచేత పరాభవింపబడి తిరిగొచ్చేది. చివరి కోనాడు తెంపుచేసి తల్లి నడిగింది "దీనికంతకూ కారణమేమిట"ని. కన్నతల్లి కడుపు కట్ట తెగి పారింది — గొల్లున ఏడ్చింది — కూతురును గుండెలమీద

పొత్తుకొంది–"ఆరు నెలలు జరిగేసరికే నీకన్నీ తీరిపోయాయమ్మా! నీ కీలోకంలో మిగిలిందంతా వొక్క– ముండమోపితనమే" నని సమాధానం చెప్పింది.

ఈ దెబ్బతో వితంతు వివాహం విజృంభించింది. కడుపు తీపి తెలిసిన కరుణామూర్తులు — సంఘావివేకముపై సాహసమును చూపించిన ధీరులు వితంతు వివాహంలో విహారం చేశారు.

అంతవరకది మరియాదగానే వుంది. "అతి సర్వత్రా వర్జయేత్"అన్నమాట మనవాళ్ళు మరిచిపోయారు. ఇపుడు చాలాచోట్ల స్వయంవరవివాహాలే పరిపాటిఅయ్యాయి. పిల్లను పిల్లాడు, పిల్లాడిని పిల్లచూచి నిర్ణయించుకొంటం వొచ్చేక పెద్దోళ్ళకీ బెడద వదిలిపోయింది పూర్వంచెప్పే గాంధర్వవివాహాలు యీతరగతికి చెందినవే యేకాలేజీలో చదువుతూనో, యే సినిమాహాలువద్ద హడావడీ జనసందడిలోనో, యే ఫాషన్‌మీటింగు ప్రోగ్రాంలోనో ఒకరినొకరు చూచుకొనటం–ఒ, కె. అనుకొనడం–లా మేరేజీ అనటం–లంకుబడిపోవటం,

ఆ క్లబ్బే వివాహమంటపం–ఆబాతాఖానీక్లబ్ నెంబర్లే బంధుమిత్రాది పెళ్ళిపెద్దలు – టీపార్టీలే భోజనాది విందు వినోదాలు–ఆ సిగరెట్లనున్న నిప్పే హోమగుండం – ఆ గోడకు నంటించియున్న సినిమాతార బొమ్మే అరుంధతీ నక్షత్రమై పోతూంది. మేళతాళాలతో పనిలేకుండా రికార్డులే మోగి పోతాయి – గృహప్రవేశాల పనిలేకుండా బీచీషికారే ప్ర

చేస్తుంది. క్యారమ్‌బోర్డ్ చెండ్లాటలౌతాయి - గంటల కాలం లోనే గర్భాదానాలుకూడా అయిపోతున్నాయి.

వివాహంకావడ మెంత తొందరో — విడాకులుగూడా అంత తొందరగానే జరుగుతున్నాయి. వెనుకటిరోజుల్లో పండు పసుపులు పెట్టుకొని ఫలానావారి పిల్లనిపించుకొంటే చాలనే వారు. ఇప్పుడా తతంగం జరిగినా యెవరికీ యేలాంటి బాధా కలగటంలేదు. ఇంకా దానిరూపం విచిత్రంగా మారుతూంది. మూడుముళ్ళూ పడ్డాసరె— మూడు రాత్రిళ్ళు జరిగినాసరె— మూడేండ్లు కాపురంజేసినాసరె — ముగ్గురుబిడ్డల తల్లయినా సరే మళ్ళీపెళ్ళవటం మనవారిలో మామూలైపోయింది.

ఈమధ్య ఓ పల్లెటూరి విద్యార్థి పట్నంలో చదువుతు న్నాట్ట. ఓ మాటు యింటికొచ్చేడు చొక్కా విడవంగానే యజ్ఞోపవీతం కొంచెం లావుగా కనుపించిందంట; "ఇదేమిట్రా నాయనా"అని యేకంగా అడిగితే "మరేమీలేదు నాపెళ్ళ యిందీ" అన్నాట్ట. ఎలాఅయిందీ? యేమిటీ? అని తిరిగి అడిగితే "వివాహమంతా వేదవిధిగానే జరిగింది. ఆ అమ్మాయి మా త్రం హరిజనులపిల్ల"ని సమాధాన మిచ్చేసరికి పెద్దలంతా నెత్తీ నోరు బాదుకొన్నారు. అప్పుడా దయామయుడైన యువకరత్నం జాలిపడినవాడై "హే జననీజనకులారా! నాకోసమై మీరింత శ్రమబడి కావలసినంత కట్నంయిచ్చేపిల్లను మాట్లాడితే మీ మాట నిల్పకపోవటానికి నేనంత బుద్ధిలేనివాడనా? మీయాజ్ఞ సిరసాధరిస్తా"నన్నాట్ట. ఇంతలో యింటికొచ్చినచాకలి యెదు

కూర్గాపోయి "అయితే ఆఅమ్మాయిసంగతో"అనేసరికి "ఛూ, నా బొడ్డుంబా"లంటూ మెడలోని జంధ్యంకాస్తాదీసీ చాకలి మొఖాన కొట్టేడు. వెంటనే ప్రక్కనున్నతండ్రి "ఇదేమిట్రా! క్రొత్తనీళ్ళొచ్చి పాతనీళ్ళనుకొట్టుకబోయినట్లు పెళ్లిజంధ్యంతో శాబు వడకజంధ్యంకూడా పారేశావురా సుపుత్రా" అంటే "కాదులేనాన్నా! మురికిపట్టిందని చాకలికి యిస్త్రీ చేయమని వేశాను. అంతేలెమ్మ"ని యీ వుద్ధారకుడు బదులు చెప్పేట్ట. స్వయంవరం అంటే యిలాంటి వివాహాలు కావండోయ్! ఇలాంటివారా స్వయంవర వివాహాలకు చీడపురుగులుకూడాను.

కం॥ అల్లుని మంచితనంటును..................
తెల్లక్షిని కాకులునులేవు తెలియర సుమతీ॥

అని చెప్పినమాట యదార్థమె. అంటే అల్లుడనదగిన ప్రతివాడూ మంచివాడు కాడనా? అల్లుడెంత మంచివాడైనా వాడి మంచితనాన్ని గ్రహించలేని అత్తమామల నేరారోపణనా? యీ రెండూ ముఖ్యాంశాలె.

అల్లుడంటేనే మంచివాడుకాడనే మాటకో స్త్రీ సూది కోసం సోదికిపోయిషాతరంకు బైత వేసుకొన్నంత పనవుతూంది. ఎలాగంటే అల్లుడయ్యాక మామకాకుండా వుండొచ్చుకాని, మామయ్యే ముందల్లుడుకాకుండా వుండేవీలు లేదుకదా? "అత్తా వొకింటి కోడలే"న్నట్లు మామా వొకనాటి అల్లుడేకదా? కొంతమంది కుమార్తెల పెళ్ళిచేయునప్పటికి తమఅత్తమామలు

సౌఖ్యంగా వుండటం, మనుమరాలి పెళ్ళికి తాతముత్తవ్వలు కూడా ముసుసుకొంటం మనం చూస్తున్నాం. అలాంటప్పుడు వారియల్లుడు వాకికెంతో వారిమామగారి దృష్టికి వారూ అంతేగదా ?

అలాగానని అల్లుళ్ళను పైన వేసుకొంటున్నామని అనుకోకండి. తానోయింటి అల్లుడ నయాసనంగానే అదో అదుపులేని అధికారమనిన్నీ.; ఆడపినిచ్చేసవాళ్లే అన్నివిధాలా అణిగివుండాలనీ. మామగారంటే మంచినీళ్ళకంటే పలచనగా చూడాలనీ తలంచేవాళ్ళులేరని మేమనటంలేదు,

ఓ ఉపాధ్యాయులవారు "రామూ! విశ్వాసంజలజంతు వేదో? విశ్వాసం లేనిజంతువేదో చెప్పరా!"అంటే రాముడు లేచి—"మాయింటిముందో కుక్కపిల్లుండేది. మేము తినగా మిగిలిన అన్నం లేస్తుండేవాళ్ళం. ఆయెంగిలి మెతుకులుతిన్న విశ్వాసాన మా యింటిలోకి దొంగలురాకుండానిద్రమేల్కొని మాయింటిని కాపాడుతూంది. ఒంటరిగా బైటకు వెళ్ళాలంటే తోడువస్తూంది. కోపంవచ్చి కొట్టినా సేవకాధర్మాన్ని చూపిస్తూంది. కుక్క విశ్వాసంగల జంతువు — మానాన్న సంపాదించిందంతాపెట్టి మా బావకు మోటారుసైకిలు కొనిచ్చాం. గడియారమడిగితే గంటల్లో తెచ్చిచ్చాం. అడిగినవన్నీ అప్పటికప్పు డందించాం. ఆయనకు కోపంవస్తే మా అక్కాయిని సరిగా చూడ్డేమోనని మేమంతా ఆయన అడుగులికి మడుగులొత్తాం. ఎంతచేసినా మాబావ మామీద నేరాలెంచటం;

మా అక్కాయిని కొట్టటం మానటంలేదు. అంచేత అల్లుడు విశ్వాసంలేని జంతువ''న్నాట్ట.

అల్లుళ్లందరలాంటివారు కాకపోగా, అమాయకులయిన వారుకూడా వున్నారు. ఓ అల్లు డత్తారింటికెళ్లాడు. అక్కడుండే మరియాదలు — ఆ పలహారాలు — ఆ విశ్రాంతి — ఆవిందు భోజనాలు — ఆ పరుపులు — ఆ తాంబూలాలు — ఆ సపర్యలు చూచి, అమితానందమై గోడమీద ''శ్వశురగృహం పరమ సౌఖ్యం ''అని రాశాట్ట. అదిచూచి తనబావమరిది ''త్రిరాత్రం శునక సమానం''అని రాశాట్ట.

ఇకపైన యోగ్యతగలవారినిగూర్చి విచారిద్దాం. అల్లుడు పరువు మరియాదలు గలవాడవుతాడు. అత్తమామలంటే పూజనీయులని గౌరవప్రదంగా చూస్తుంటాడు— భార్యంటే శ్రద్ధగా వుంటుంటాడు — అలాంటప్పుడు అత్తగారికి జబ్బుంకురిస్తుంది. అల్లు డమ్మాయితో శ్రద్ధగా వుండట మొక అధమ స్త్రైణ మను కొంటారు— మామగారికి మరియాదిస్తే మలపసన్నాపి లెమ్మను కొంటారు— అత్తగారి నభినందిస్తే అంట్లపక్షి లెమ్మంటారు. అక్షరాలా అమ్మాయిపెత్తనమే సాగాలి అమ్మాయి అడుగాజ్ఞలలో అనుక్షణం అల్లుడు నడవాలి; మనింటి కుక్కలా మసలు కోవాలనే మహావ్యాధి అత్తగారిలో ముందు వంటబట్టిపోయి యింజెక్షనుమందులా మామగారి నరనరాలకు పాకిపోతూంది. మొత్తంమీద అల్లుడి మంచితనంమాత్రం అనుకొంటానికికూడా దొరకనిమాట నిజమే.

ఆడపిల్లల గన్నవారి ఆశయాలుకూడా చూద్దాం. వీళ్ళ రాతలు రాళ్ళేలుతూంటే బుద్ధులు భూములేలు తూంటాయి. అమ్మాయి మర్కటాకారమైనా అల్లుడు మన్మథాకారుడు కావాలి—అల్లుడొస్తే పూట అన్నం పెట్టలేకపోయినా అమ్మాయి అత్తవారుమాత్రం ఐశ్వర్యవంతులు కావాలి—అమ్మగారికి అక్షరజ్ఞానం లేకపోయినా, అయ్యగారు కనీసం బి. ఎ. అన్నా చదివుండాలి. ఇవో సంబంధమైన గొంతెమ్మకోర్కెలనుకొండి. మరికొన్నిచోట్ల ఆడపెత్తనం సాగుతూంటుంది. ఆడపెత్తనానికి అర్థమంటూవుండదు. అమ్మాయి అత్తవారింటికి పోయేలోపలే ఆ అత్తగారు టికెట్ పుచ్చుకోవాలి. ఆడబిడ్డలు రావటం మానుకోవాలి. మామగారు మాటాడకూడదు. బావలుగాని, మరుదులుగానుంటే భాగాలాదులుకొనిపోవాలి. ఇలాంటిపరిస్థితుల్లో చుట్టరికం చేయటాని కెళ్ళేవాడితిప్పలు శునకరాజంబుల కెరుకలై—డొంక తిరుగుళ్ళతో—గుంట చిక్కులతో—పగవాళ్ళకైన పనికిరాదన్నంతగా వేధిస్తుంటుంటాయి.

రాను రాను పెళ్ళిళ్ళకుకూడా బ్రోకర్లు తయారయ్యారు. కొంతమందివద్ద పెళ్లికూతుళ్ళలీష్టు—పెళ్లికొడుకులలీష్టు—సిద్ధంగా వుంటాయి. ఇందులో రకాలున్నాయి. ప్రథమ సంబంధపమ్మాయీలు—రెండో సంబంధపమ్మాయీలు—మూడో సంబంధపమ్మాయీలు. అందులో సెక్షన్స—ఆ సెక్షన్స్లోనూ మళ్లీ సబ్ సెక్షన్స్కూడా వున్నాయి. పెనిమిటి చచ్చిపోయినక్వాలిటీ వొకటి—పెనిమిటుండగా విడిచిపెట్టిన క్వాలిటీ రెండు—పెనిమిటిచే విడిచిపెట్టబడినక్వాలిటీ మూడు. ఆడవాళ్ళలో కొలా

గో అలాగే మగవారిలోనూ అన్ని వెరైటీలవారగూ తయారయ్యారు. ఈమధ్యనొక వార్తాపత్రికలో యిలా ప్రకటించారు.

" ఇరువదేడుల వయసుగల వితంతువు. మంచి రూపవంతురాలు. హార్మోనియం చక్కగావాయిస్తూ నెలకో యేబది రూపాయలు సంపాదిస్తూంది. వివాహమాడేవారుంటే యీ దిగువ యడ్రసుకు వ్రాయండి. సా. అండ్. సా."అంటూ— దానికో యువకుడిలా వ్రాశాడు. "మహాశయా! మీ ప్రకటన చూచాను, చాలా సంతోషం. అయితే వో సందేహం. మీ అమ్మాయి నెలకో యేబదిరూపాయలు సంపాదిస్తుందని వ్రాశారు. అయితే ఆమెకు కావలసినవారు అంతకంటే యెక్కువసంపాదనపరుడా? లేక ఆమె సంపాదనతో కుటుంబం జరుపుతూంటే యింటిలో వంట మొదలైనపనులు చేసేవాడా? దయచేసి తెలుపవలయును"ని. అయితే "ఆవుత్తరాని కీనాటివరకూ జవాబురాలేద"ని మనమిత్రుడు చెప్పుతున్నాడు. ఇక ముందుమాత్ర మెందుకొస్తుంది లేండి.

మరో అడుగు ముందుకేద్దాం. కన్నెగలవారికి కట్నాలిపుడు కంతవురిద్దై పోయాయి. పెళ్ళిళ్ళంటే గేదెల వ్యాపారమయింది. అందుకనే మహాకవి కాళ్లకూరి నారాయణరావు పంతులుగారు " అంగడి కూరాకువిధాన—వేలమున చొక్కా, టోపి, పాకాలకై వడి—సంతన్ పశువట్లు పెండ్లికొడుకున్ వ్యాపార మార్గంబునన్"అన్నారు.

ఓ పట్నంలో వో బ్రాహ్మణుడుండేవాడు. ఆయన కలెక్ట

రాఫీసులో గుమస్తాగా నౌకరీచేసి పింఛను పుచ్చుకొన్నందున "యిందుగల డందు లేడను సందేహమువలద"నినటు లయినవాటి మీదా కానివాటిమీదా సర్వాధికారం సాగిస్తూ "చతురం భోధిపరీతమైన ధరణీచక్రంబ"ంటూ నాలుగుగోడల మధ్యనున్న యేతత్ గృహోఖిల సామ్రాజ్యాన్ని పరిపాలిస్తున్నాడు. కూరల్లో వేసే వుప్పూ కారాల దగ్గరనుంచీ గోడలకుకొట్టే మేకులవరకూ లెక్క— పుచ్చిపోయిన కూరగాయలయినా చచ్చినట్లు వండాలి సిందే—అగ్గిపుల్లలతోసహా అజా తేలాలిసిందే—చిన్నా పెద్దలెవ రినీ చెలకట్టనీయకుండా మన యీ దౌర్భాగ్య దామోదరచక్ర వర్తిముందు తక్కినవార "లరిరాజవర్గం బరికాపులై-కొలువ" వలసినవారైరి. అనుభవనీయు లందులకైకాబోలు "అధికారాం తమునందు చూడవలె మా యయ్యోరి సౌభాగ్యముల్"అని సెలవిచ్చాచు.

ఆమహానుభావునకు మువ్వురుమగపిల్లలు, వక కుమార్తె వున్నారు. పింఛను సంపాదనతోపాటు రెండెకరాల మాగాణి కూడావుంది. బొత్తిగా లేనివాడుమాత్రం కానందున యీ పిల్లను, తానూ, తనభార్యా కుటుంబమోమోస్తరుగా జరు పుకొంటున్నారు. మరో ఆడపిల్లలుగలతండ్రి వీరింటికి వియ్య మందుదామని వచ్చారు, "మాయింటికొస్తూ మాకేమి తెస్తారు? మీయింటికొస్తే మాకేమిస్తార"న్నట్టుగా మరియాదలు చేసి కూరుచున్నారు. కాబోయే కోడలుయొక్క విద్యా బుద్ధు లడు గలేదు — వయసు విచారించలేదు — మంచీ చెడ్డలేమీ మాటాడలేదు — యెదురుగానున్న వియ్యంకులవారి గోత్రి

ప్రవర లడగలేదు—చివరకు నామధేయమైనా తెలుసుకోలేదు గదా పిల్ల పేరయినా ప్రశ్నించలేదు. ఆయన తయారుచేసిపెట్టు కొన్న క్రొత్తసంవత్సరపు కట్నాలపట్టీనిలా నివేదించాడు. పెద్ద బ్బాయి బి,ఎ— వాడికికట్నం మూడు వెయ్యినూ్నటపదహార్లు—రెండోవాడు యింటరు వాడికికట్నం రెండు వెయ్యినూ్నటపద హార్లు—మూతోవాడు యస్, యస్, యల్ సి. వాడికికట్నం వక వెయ్యినూ్నట పదహార్లు. ఇందులో తమకేది యిష్టమో సెలవిచ్చి బయానా దయచేస్తే ఆసద్దు మీాకింద ఖాయంచేస్తా నంటూ ముగించాడు. తలుపుచాటుననున్న వియ్యంకురాలు "ఆడపిల్లల లాంచనాలకింద ఐదువందలరూపాయలు— ముత్తవ్వ పుట్టింకింద ముప్ఫైరూపాయలు—అత్తమామలిద్దరికీ అచ్చం జల తాసుబట్టలు అంటూ మెల మెల్లగా ప్రాంటింగ్ యిస్తూంది. అర్ధాంగలక్ష్మిగారి వాక్యం వ్యర్థంకాదంటూ పించెన్‌దారుడు, అంటే నెమిలిపించెన్‌దారుడు కాదులెండి; తెరచాడు పెళ్లాం పాటకు తెరబైట తాళంవేస్తున్నాడు.

బజారులో సంచులుపెట్టుక కూరుచున్న బైరాగి హోష ధులపేరులు చెప్పినట్లు; కాఫీహోటలులో సప్లయిరు తినుబండా రముల పేరులు చెప్పినట్లు గుక్కతిప్పుకోకుండా దంపతులిద్దరూ గుప్పించేస్తూంటే పాపమూ వచ్చిన పెద్దమనిషి "మీాయింట్లో కొంచెం అమృతాంజనముందా?" అని అడుగుదా మనుకొని మళ్ళీ ఆలోచించి—అమృతాంజనమడిగితే దానికిగూడా యేమైనా కట్నమివ్వవలసొస్తుందేమోనని భయపడి ఆరంభించి పరిత్యా జించకుండగనే నమస్కారంచేసి—లేచి—సెలవుతీసుకొంటూనన్నా

డు. ఇంటికివచ్చిన మనిషికి కాళ్లుకడుగుకోను నీళ్లు లేవు—మా
టలమధ్యలోనయినా మంచితీర్థం పుచ్చుకుంటారా యనలేదు—
పైమాటకయినా భోజనానికి లెమ్మనలేదు, యింకా పైగా
బొమ్మచీరెమా టడగకపోతినే—వెండికంచం, వెండిచెంబు
చెప్పకపోతినే— పట్టెమంచం, పట్టుబట్టలు మరిచిపోతినే అని
ఆందోళన పడుతున్నారేకాని, పాపం—యెప్పుడు భోంచేశారో
యేమో ననుకోరా పుణ్యాదంపతులు. ఇలావుంది వీరి మరి
యాద. యిలాంటి పెద్దమనుష్యులు మరోయింటికి వెళ్లినపుడు
"యింటివద్దనున్న చంటోడికి మరో పదిగారెలు పార్శిలు చేయ
మం"టారు—వేషం భేషజపూరిత మంటానికి వెలితిలేకుండా.

"ఎలమి నాతనికంటె యితడు ఘనుడ"న్నట్లుగా నొక
రినిమించిన మహాత్ము డింకొకరు. ఓచోట పెళ్లిలో చుట్టాలు.
మిత్రులూ ఘరానాగా చదివించేరు. ఆపెళ్ళికొడుకుతండ్రి అన్ని
పనులూ అందరిమీదా పెట్టాడు కాని, చదివింపులను భద్రం
చేసే బాధ్యతమాత్రం యెవరికీ చెప్పకుండా సదరు డిపార్టుమెం
టులో వారే చార్జీ పుచ్చుకొని డబ్బంతాయెంచి పెట్టెకుబెట్టు
తూంటె వారి ధర్మపత్నిగారు "తుదిప్రాణమిత్రుడయినన్ ధన
మందున నమ్మవచ్చునే?"అని చెప్పినకవి భర్తనయినన్ నమ్మ
వచ్చునే అని చెప్పకపోతేమాత్రం తానెందుకు నమ్మాలంటూ
పెనిమిటిగారి అకౌంటు దాఖలా మొత్తంమీద సూపర్ వైజ్
చేయడం మొదలెట్టింది. "దుష్టునకు లోకమంతయూ దుష్టమ
యమే"అన్నమాట అబద్ధమెందుకవుతూంది? మొగుడు తెచ్చిన
దానిలో తృణమో ఫణమో బొడ్డులోదోపే వొడ్డయిల్లాలు.

భర్తనేమిటి భగవంతుడినిమాత్రం నమ్ముతుందా? ఆ వచ్చిన కష్టాలలో ఆయనేమైనా "తస్కరణాం పతయే నమో, నమో" అంటాడేమోనని మాయదారి లక్ష్మీదండకం పఠించకుండా తగు జాగ్రత్త వహించిన యీ నారీమణి సామాన్యురాలా? ఈలాంటి యింటిదొంగలను పట్టడానికి యీశ్వరుని తరమా? అథవా పట్టినా — నిజమాడి నిగ్గగలమా?

"అయితే పట్నవాసులంతాయింతేనా" అని మీరడుగుతారేమొ? అబ్బే; అదేంమాట "లోకో భిన్నరుచిః" అన్నారు. ఆమాటకొస్తే పల్లెటూరివాసులంతా పరమ ధార్మికులని యెలా చెప్పడం? "మరుభూమి కేగినన్ లభించు" నన్నట్లు బస్తీలలో పరమ ధార్మికులు లేకపోలేదు. పట్నాలలో అంతా లోభులే అయితే యింతింత ధర్మసత్రాలు—ఆలయాలు—యెన్నో కట్టిస్తున్నారుకదా? ఎలా జరగటం చెప్పండి? అలాగే "పాతాళమున కేగి బ్రతుకవచ్చునటన్న బలిచక్రవర్తినన్ బట్టియిచ్చు" నన్నట్లు పల్లె గ్రామాలలోకూడా ప్రాణాలుతీసే పరమ క్రూరులున్నారు. కాదనటానికి మా తరమా?

ఓ గ్రామంలో వో కరణంగారున్నారు. కరణం అంటేనే సామాన్యంగా కాలాంతరకుడై వుంటాడు. అందులో యీయనగారు అందెవేసినచెయ్యి— పేచీ వ్యవహారాల్లో ఫీజులేకుండానే వకాల్తా పుచ్చుకుంటాడా మహాశయుడు. వారికో యిద్దరుకొడుకులున్నారు. వారికీ వాలిసుగ్రీవులకూ తేడా యేమాత్రమూ కానరాదు. విద్యాబుద్ధుల మాటకొస్తేమాత్రం అన్నందమ్ములిద్దరూ

కాని—అక్షరంచొారవ మాత్రంలేదు. సంధ్యావందనమంటేనే "సహాస్త్రాపరాధం కరిష్యే" అనేవారికి సాహిత్యమేముంటుంది? ఎలావుంటుంది? అయితేనేం? ఆస్తిమాత్రంవుంది. "దానధర్మంబు ఎంతేని దలచరాని, కడుపునిండగ నన్నంబు గుడువలేని, బంధు మిత్ర యాచకులతో పలుకబోని, లోభియింట లక్ష్మికొకింత లోటుగలదె?" అనినట్లు మనవారికి భారతీప్రసన్నం లేకపోయినా భాగ్యలక్ష్మి ప్రసన్నం మాత్రంవుంది.

"ధనమూలం మిదంజగత్" అన్నారుగా మన పెద్దలు. అంచేత చాలామంది పిల్లనివ్వాలనివచ్చేవారు. వస్తేసరా? పెండ్లి కొడుకు సమాధాన మలావుంచి, పెళ్ళికొడుకు తల్లిదండ్రులకు ముందు సమాధానంచెప్పటం ప్రథమ కార్యక్రమం. ఆతరువాత పార్లమెంటువారి ఆర్డరులాంటి యింటి కామందురాలిగారి పరిమిషన్ పొందటం సాధ్యపడేదికాదు. చివర కాయనగారొక లక్షణమైన సంబంధాన్ని తలెగకేశాడు. అయిదువేల రూపాయలకట్నం—అచ్చటా ముచ్చటా జరుపుకొనేవాళ్లు "ఇంతున్న కాపరమైతే అంతేసాలులెమ్మ"నుకొని యీ నిరక్షర కుక్షికి పిల్లనిస్తానికి వారంగీకరించారు. ఇంతా అయితే యేంలాభం?

మాటిచ్చివచ్చిన యజమానిగారికి యింట్లో మంచినీళ్లు పుట్టలా. "ఇంగ్లీషు చదువుకొన్నపిల్లను చేసుకొంటమే? ఏమని స్థిరంచేసుకొచ్చావు నూరుచెప్పు—వెయ్యిచెప్పు. యీ సంబంధమంటే నేనొప్పుకోనం"టూ మోడి పెట్టుకుంది. పాపమాయన పని పారిజాతాపహరణమునకు ముందు సత్యా కృష్ణుల సరసం

లోకి దిగింది "ఏదో నోరుజారి, పొరపాటుగ మాటిచ్చాను. మాటమాటకో స్త్రీ మగముండాకొడుకును నలుగురులో తలెత్తుకొని తిరగలేను. దాసుకిమీదకోపం దణ్ణంతో సరిపెట్టుకొని— ఎక్స్ఛేంజ్ చేసి యీ పరిమిషన్ మీద సంతకం చేసెయ్యవే..నీకు పుణ్యముంటుంది—నాకు పేరుంటుందని" చెంపలేసుకొని— చేతులు పట్టుకొన్నాడు.

"స్త్రీనాం మర్దనం సారం" అన్నారుకాని, మనపెద్దలు మాటలతో వింటారని మగువలనుగురించి చెప్పారా? మర్దించటానికా మన సుబ్బారాయుడు సుబ్బారాయుడేనాయె — మంచిగవింటే ఆమె మంచతనం బయటకురాదూ? మగడు లొంగుతూంటే మగువ పొంగుతూండటం మనవారిలో యిదో మాయదారి జబ్బిందాయె.

"స్త్రీల ప్రాథమిక హక్కులు చెల్లాలిసిందే"నన్నట్లు తానుబట్టిన కుందేలుకు మూడేకాళ్ళం"టున్న భార్యముందు— దాసానదాసుడై పోయాడు. మళ్ళీమాటాడితే "కాలుబెట్టినతోనే కాంతునిమెడవిర్చి నిండుసంసారంబు రెండుచేసి"న యీ యిల్లాలు "పట్టజాలక పెనిమిటియిట్టియనిన బావికినిగోతికినివేగ పసువులెత్తి భర్తమొముకలు గోరికెడిభార్య"యని జ్ఞప్తికిదెచ్చుకొని — చచ్చినట్టులా సంబంధానికి హాళ్ళోదకాలొదిలాడు,

వెనుకటికో సాయిబుగారి నో స్నేహితుడు "సాయిబు గారూ! సాయేబుగారూ! యిలా చిక్కిపోతున్నారేమండీ"అని

అడిగితే సాయిబుగార్కి కోపంవచ్చి "అరె, చిక్కిపోవటం హేంటీ? చిక్కిపోతాన్ - హింకా చిక్కిపోతాన్ - చచ్చిపోతాన్ - మన్నైపోతాన్ - దుమ్మైపోతాన్, నాకీయిష్టం అన్నాట్ట. ఆడవాళ్ళ పట్టుదలలుగూడా అలాంటివే - ఇంటికి వచ్చిన సంబంధమునేగా పువ్వు ద్రుంచినట్లు తుంచేసింది కాని, అందువలన యెన్ని యిబ్బందులువస్తాయో తెలుసుకోకపోయిందికదా ?

తరువాత వీళ్ళయింటికిసంబంధానికి రావటమంటే "అతడనేకయుద్ధముల నారియు తేరిన వృద్ధమూర్తి"యని "పిల్లినచ్చె యెలికా భద్రం"అన్నపుడు పిల్లలు పారిపోయినట్లు పారిపోతున్నారు. పెద్దరికానికిపోతే చివరకు పెళ్ళయ్యేగతిమారిపోయితను పిల్లలు "భీష్మ బ్రహ్మచర్య మువలంబించే పరిస్థితి" కొచ్చింది.

"తాడి తన్నేవాడ్ని తలదన్నేవాడు "టాడు గదండీ! జగత్ కిలాడి జగన్నాథరావు నంటూ వచ్చేలు. అయితేనేం; కట్నమివ్వననటం కాకుండా పైపెచ్చు "కన్యాశుల్కం కావాల"న్నాడు, ఆయనగూడాకాదంటే అబ్బాయిలిక బ్రహ్మచారుల వర్గంలోనుండి గృహస్థుల జాబితాల్లోకి రారాయె. "పోనీ కర్చిద్దామా"అంటె నలువురిలో నామర్దావస్తుందాయె? అందుకని ఆలోచించి, ఆయన అడిగినకట్నం అణాలతోగూడాయిచ్చుకొన్నాడు. పదిమందిలో పరువు నిలపమంటూ అయిదువేల రూపాయలిచ్చి "పెళ్ళికాలంలో అలుడికివిూరు కట్నంయిచ్చినట్లుగా యివ్వండి"అని చాటుగా ఆయనచేతిలో బెట్టాడు.

"లీల గుడి మ్రింగువానికి లింగమొంత ?" ఆయన ఆపైకం యీపైకంగూడా "గుటకాయస్వాహా" అని ప్రధమఘంటే. జౌపోసనపట్టినధీరుడాయె. మంగళసూత్రధారణ జరుగపోతూంది. యీపరాలుగారిదో దగ్గాగదా అని "కట్నం చెల్లించకుండా పసుపుతాడుకట్టే వీలులేద"ని గంభీరం చూపించింది. అన్నిటికి తానైయున్న ఆ వియ్యంకుడుగారు లేచి "కట్నాలనే పేరుతో కానీ గూడా యిచ్చేదిలేదు. కావాలంటె పెళ్ళికానివ్వండి. లేకపోతే లేచి వెళ్ళండి." అని నిర్మొగమాటంగా చెప్పాడు.

సిరిభంగంతోపాటు వారికి శృంగభంగమయింది. లేద్దా మా అంటె లేకితనమేనని తెలుసుకొన్నారు. చెన్నాక్రింద తేలుకు ట్లై చెప్పినట్లు చేసుకొనివచ్చారు, "మా మంచిపనిజరిగింద"ని పదిమందీ మెచ్చుకొన్నారు,

ఈ విధంగా లోపాలు యిరుపార్శ్వంబులలోనూ కాస్తా కూస్తావుంటూనేవున్నాయి. మనుష్యుల మనసులు మంచివి కాగబోయేసరికి తేలికవిషయాలే చాలా తీవ్రరూపాలు తాలుస్తున్నాయి. ఇవి ముందు మనస్స్పర్ధలుగా ప్రవేశించి - యీర్ష్యగామారి-పేచీ సందర్భాలుగా పర్యటనగావించి - పాథింపురూపంతో సాహసించి - కతుగా కదనంద్రొక్కి - "యింతింతై వటుడింతై మరియు దానింతై" యున్నట్లు గోరంతలు కొండంతలుగాపెరిగి, మౌంట్ ఎవరెష్ట్ శిఖరంకంటె మహోన్నతమై- "గుప్పించి యెగసిన కుండలంబులకాంతి గగనభాగంబును గప్పికొనగ" నన్న మాటను గురుతుకు తెచ్చుకొని, అపెర మేఖనా

ధుడై - మంచుకొండలనే అమాంతంగాదొర్లించి మాటభేదం
వచ్చినవారిని మార్ణంచేయాలంటూ చూస్తారు.

హాయిగా, స్థాయిగా వియ్యమందినవాళ్ళకీ వివాదా
లెందుకు? ఇచ్చుకొన్నాక—పుచ్చుకొన్నాక యీపాటినోర్పు
లేకుంటె యెలా? పోనీలెమ్మంటూ ముందొక రోర్చుకుంటా
రయ్యా! ఆదివాళ్ళ అసమర్థతని భావించి తెగిందాకా లాగు
తారే, యీ రెండోవాళ్ళు. మొదటిమాటకొస్తే గోళ్లతో తుం
చితేపోయేవాటికి గొడ్డళ్ళెందుకు కావాలి? చెప్పేదుమాటల
మహాత్యమా? చేతగానితనమా? రెండున్నూ. కొద్దిపాటాలో
చనేవుంటె కొట్టుదాకాపోతారా? ఒకరు పోవాలంటె రెండో
వారు పోనిస్తారా? ఎంత తెలివితక్కువ? ఎంతలోకువ? ఆలూ
మగల తగవు అన్యులా తీర్చువారు?

ఓగ్రామంలో స్థితిగలాసామియున్నాడు. ఆసామంటే
అట్టె పెద్దవాడు కాదులెండి. ముప్పదేళ్ళ వయసులో వున్న
యువకుడే — ఆయనకో సంబంధం కుదిరింది. అసలే జల్సా
రాయుడు — అందుకుతోడు తగినంత ఆస్థిపాస్తులున్నవాడు-
ఆపైన అడిగినట్లుగా ముప్పైఅయిదువేల కట్నమిస్తున్నారు—
అన్నిటికిలాగే తనకడ్డుచెప్పేవారు లేరు.

ఇక చెప్పేదేముంది? "నాయింటికి నేనే పెద్దలు పిల్లికిపె
ట్టరా వంగనామాల"ంటూ బ్రహ్మాండమైన కార్యకలాపంలో
కాలుబెట్టాడు. "అల్పుడధికారియైన తా నర్ధరాత్రమందు

ఛత్రింబుబట్టి దెమ్మనునుగాదె?'' యనినట్లు "మూడుపూవు
లారు పిందెలుగా" భోనభోంతరాళంబులు భూరికొనినట్లు ప్రా
గూర మోగిపోయిందా పెళ్ళివైభవం.

ఇంతకూ పెళ్లికొడుకు అందగాడా, కాడా? తనకు యీ
డూ, జోడూ సరిపోతుందా? లేదా? యని పెళ్లికూతురుగారి
యాలోచన—అల్లుడు పరువు మరియాద లున్నవాడా? కాడా?
నలువురిలోకి పోదగినవాడా? అసమర్థుడాయని మామగారి మనో
విచారం— అమ్మాయి కాపరంలో అన్నిసుఖాలూ వున్నాయా?
లేవా? అత్త మంచిదేనా; ఆడబిడ్డలు గడుగ్గాయిలా అని అత్త
గారి ఆరాటం— ఈ సంబంధం పాతదా? కొత్తదా? లోటుపాటు
లేమైనా వున్నాయా, లేవాయని ముఖ్యబంధువుల మొదటాలో
చన— అనుకొన్నకట్టడి అనుకొన్నట్లు యిస్తారా? చివరకేమైనా
చిక్కుబెడతారా అని పనివాళ్ళ పరామర్శ — సంభావనలూ,
సత్కారాలు జరుగుతాయా? జరుగవాఅంటూ కవి, గాయక,
పండితాది విప్రుల ప్రశంశ—అన్నదానం చేస్తారా? లేదాయని
పేదవారి పేరాశ—ఇంతమంది దృష్టి పెళ్ళిపెద్దమీదికే యేకంగా
ప్రసరిస్తూంది.

ఆ పరిస్థితిలో మన జల్నారాయుడుగారి గ్రుడ్డిదర్బారులో
కాదనగలవాడేడీ? మొత్తంమీద కట్నాలబాపతుసొమ్ము కానీ
లతో మిగలకుండా "కాకబాకీసరి" అన్నట్లుగా ముప్పైదువేల
రూపాయలూ మూడోనెల రాకముందె సర్ది వాడుకొంటూ
సరిపెట్టాడు.

పెళ పెళలాడిన పెళ్ళికొడుకు కళ కళలాడేలా కాపరం చేసుకోలేక పోయాడు. భార్య కాపరానికొచ్చింది. అత్తా మామల అధికారం లేదు— ఆడబిడ్డల అదుపూ లేదు— కాపరంలో లోటు లేదు — కావాలన్న వాటికి కొరత లేదు. అయితేనేం! "పడుచుల కాపురం చిదుగుల మంట"లా మండిపోతూంది.

మండిపోవడ మేమిటంటారే మొ—ఈర్ష్యాసూయలాయింట్లో యెకసెక్కా లాడుతున్నాయి — క్రోధావేశాలు వారిలో స్త్రీలు పట్టుతున్నాయి. ముందు ముస ముస లాడటంతో ప్రారంభమై ముగియవచ్చేసరికి ముష్టి యుద్ధాలవరకూ వస్తుందా భార్యాభర్తల ప్రణయ కలహం. కలహానికి కారణమేమిటంటారా! ఆ భర్తగారికి వూళ్లో మరో అందాలరాణివుంది. మరింకా కాపురం మంచిపంథాలో యెలా నడుస్తుంది.

దీని కసలు మూలమేమిటో చూచారా! "నే నింతవాడనైయుంటే నేనడిగినంత కట్నమివ్వని పిల్లని పెళ్లాడ్తమా!"అని తనకు యీడూ, జోడూగల పిల్లలను, పరువూ మరియాదగల సంబంధాలను వొదులుకొని—ముప్పైయేండ్లు వొచ్చేదాకా భీష్మించుక కూరుచున్నాడు. కట్నంకోసం కళ్యాణం మానుకొన్నాడంటె యీ మహాపురుషు డెంతటి వాడంటారు. ఈ లోపల యితడో అందాలరాణిచేతిలో కీలుబొమ్మయైపోయాడు.

అలాంటివాడు పెళ్ళయినా మానుకొన్నాడా! అలా ఐతే పదిమందిలో తనదర్జా తరిగిపోదూ! తనహోదాకై తాళికట్టాడు.

"ముప్పదైదువేల రూపాయలకట్నం—మూడుబండ్ల సామానుతో—ముద్దులపెళ్లాం యింటికివస్తే, మగవాడిమనసు మారుతుందేమో"నని "చక్కగ నాడువారి రతిసంపద లందినయట్టి మీరు మీ యక్కరదీరినన్ పలుకరక్కటా"యను పోటుమాటలతోనో; "నగ్న సౌందర్యరాసినో నాథ!"యనుచునో! మొత్తముమీద ప్రేమరసం తొణికసలాడిస్తూ వుంపుడుగత్తె ప్రియుని వృష్టూత యూపింది.

ఆనోటా ఆనోటాబడ్డ యీ చరిత్ర అర్ధాంగ లక్ష్మిగారి వద్దకుమాత్ర మెందుకురాదు? అపర నారదాకాకు లెవరోవచ్చి అమూలాగ్రంగా వినిపించి మనసు మార్చేశారు. "మనసుయిరిగెనేని మరి మార్గమేదయా?"యనిన్నట్లు ఈ సంధర్భంలో ఆడవాళ్ళకు సమాధానం చెప్పటం సామాన్యమా? "ఆడదానిబొంకు అడ్డంబెట్టినగోడ—మగవానిబొంకు మేదరవాని తడిక" అన్నారు. అలాంటప్పుడు భర్తగారు యిల్లాలుతీసే యిన్‌ఫర్మేషన్‌తో క్రాస్ చేస్తుంటే పాపం కదలలేక పోతున్నందున "అన్యథా శరణంనాస్తి" అనాలిసొచ్చింది. అలాఅంటే యెలా? "మమదేవతో భ్యోన్నమః" అంటూ మరొక్క నాతిదగ్గర మనసుపెట్టినవాడు "హం మేషం—శతం వ్యాఘ్రిహం—పంచతీ కుంజరః—యేక సింహాం భక్షాణి"అని హుంకరించేసి—మరలా ప్రియురాలి వద్దకు బోయి "ఒడలుమాత్ర మచట పడియుండెనేకాని ప్రాణమంతనీదు పజ్జనిలిచె"నన్న పద్యం వప్పగించుదా మనుకొన్నాడు కాని పాపమా పప్పులీ భార్యముందుడక లేదు.

కొంపలోవాళ్లు చివరకు కోర్టులోబడ్డారు. పెద్దమనుష్యుల విచారణలు ప్లీడరులదాకా పోయింది. "కామపరిమాణమో, కలికాల వైపరీత్యమో" కాని అగ్నిసాక్షిగ పెళ్లాడిన ఆ అమ్మా యిని పబ్లిక్ కోర్టుమీద పదిమంది పెద్దవాళ్లలో — పట్టపగలు — ప్రమాణంచేసి "నాపెళ్లాంకాదని" నగారా మోయించినట్లు చెప్పేశాడు. వారికితోడుగా అతివాదులు, మితవాదులు యేర్ప డ్డారు. చివరకిది "అభినయ శాకుంతలా" నాటకమైపోయి ఆకాశవాణి సాక్ష్యంతో భరతవాక్యం చెప్పమంటూ బల్లమీద ప్రత్యక్షమైంది. మరి జడ్జిగారి బుఱ్ఱకు జీడంటుకొంది. ఏమిటీ చేయటం?

అసలు పెళ్లికిముందే యీ విషయం తెలిస్తే బాగుండేదే కాని—యెలా తెలియటం! "వారిజాక్షులందు; వైవాహికము లందు.......................... బొంకనచ్చు ............ ............"నన్న శుక్రనీతిని చాలామంది పాటిస్తారు. నూరు కల్లలాడి వొకయిల్లు నిలిపినవాళ్లు యీ కల్లోలాల్లో యీ రకంగా అటోపుల్ల—యిటోపుల్ల వెయ్యటమెందుకు? అదీ గాక సామాన్య లోపాలుంటే సరిదిద్ది చెప్పమన్నారుకాని— పరమ దురాత్ముల్నికూడా యింద్రుడ్ని—చంద్రుడ్ని చేసిచెప్పి — అభమూ శుభమూ యెరుగని పొరుగమ్మగన్న బిడ్డల నంట గట్టి — పసికాపరాలలో పాములపుట్ట పెట్టడమేనా ధర్మం? ఏదీ ఆ ధర్మం; ఒకయిల్లు నింపడానికి నూరబద్ధాలాడే పుణ్యా మూర్తులంతగా కష్టపడి యితరులకు చెప్పకపోతే—వారికుమార్తె

లనేయిచ్చి మధ్యవర్తిపుణ్యాన్ని — కన్యాదాతపుణ్యాన్ని కూడా యేకంగా మూట గట్టుకొని బుజాన వేసుకపోరాదూ ?

పెళ్లిళ్ళ బ్రోకరులున్నారని యిదివరకే చెప్పేంకదండి! ఇక వీరిపెళ్లిళ్ళనుగురించి బయలుదేరేవారు ఆర్డర్సు బుక్ చేయటానికి వీరిపేరువెంబడే వీరికి కావలసిన సంబంధాల వివరాలు కూడా వుంటాయి. వుదాహరణలు కొన్ని వినిపిస్తా చూడండి! గుంటూరు గుత్తికొండవారబ్బాయి. పేరు పార్వతీశం. వయసు యిరవైమూడు సంవత్సరాల యేడునెలల పదకొండురోజుల రెండునిమిషాలు. దబ్బపండులాంటి రంగు — దానిమ్మ యిత్తనాల్లాంటి పళ్ళు — అయిదడుగులయెత్తు, అంత లావూకాదు, సన్నంకాదు. ఆస్తి రెండెకరాలభూమి— యిల్లు — పక్కడే పిల్లాడు — స్కూల్ ఫైనల్ మూడుసారులుతప్పి యీయేడు యింటరులో చేరాడు. వీరికికావలసిన సంబంధం ఎలాంటిదంటే!— పెళ్ళికూతురు చిరునవ్వునవ్వితే బుగ్గలమీద కొద్దిగా పడీ పడనట్లుగా చుక్క కనపడాలి. నడుస్తూంటే వొాగుడాకు కంటే తేలిగ్గా యెగిరిపోవాలి. సినిమాచూచివస్తే యింట్లో డ్యాన్సువెయ్యాలి. పల్లెటూరి బూ్రిట్లా లేకుండా, అప్టుడేట్ పేషన్సుతో అందాలు దిద్దుకోవాలి — సినిమా గరల్ లాగా చీరె సింగారించాలి — యిండిపెండెంట్ లైఫ్లాగా యెక్కడికంటె అక్కడికి యెగిరిపోవాలి.

తరువాత "సెకండాఫర్" నెల్లూరు; నూజీడీలవారబ్బాయి. పేరు నగరాజారావు. వయసు పద్దెనిమిదేళ్లు మూడు నెల

లకు 2 రోజుల తొమ్మిది గంటలు తక్కువ. ఎత్తు సామాన్యం. నల్లటిరంగయినా నవ్వుమొగంతో కలకల లాడుతూంటాడు. ఫోర్తుఫారం చదువుతున్నాడు. యిల్లూ, పొలాలు లేవు. కట్నమంటే ఆయనతండ్రి కేమాత్రం యిష్టంలేదు. వారికికావలసింది మరియాదా, మట్టూ, ఈకాలపు లక్షణాలేవీ పనికిరావు. అయితే ఒకటిమాత్రం కావాలి. తన వియ్యంకుడు మాంచి భాగ్యవంతుడు కావాలి. ఆయనకు మగపిల్ల లుండకూడదు. ఆడపిల్లయినా వక్కతేగనే వుండాలి. పెళ్ళికాలంలోనే ఆతనికున్న ఆస్థిపాస్థులు అల్లుడిగారిపేరవ్రాసి రిజష్టరుచేస్తేచాలు.

ఇకన "ఫర్ష్ ఆఫర్" బెజవాడ, బీరకాయలవారమ్మాయి. వయసు పదిహేనేళ్లు. యెఱ్ఱటిరంగు — యెత్తూ, లావు సమానం. ఫష్టుఫారం పాసయింది. పేరు పద్మావతి. మొదటి మొగుడు నల్లగా మొద్దుగా వుంటాడని వొదిలిపెట్టింది. కాపరం చేసిన యేడాదిలో పుట్టినపిల్లాడ్ని పెనిమిటి తీసుకెళ్లాడు. విడాకులుకూడా ముట్టాయి. ఇక వాళ్ళకు కావలసిన సంబంధం. కుఱ్ఱా డందమైనవాడుకావాలి. యిరవైయేళ్ళకు మించకూడదు. బి. ఎ చదివియుంటె బాగుంటుంది. ఆస్థి వుంటూందికాబట్టి అట్టే జీతం పెద్దది కాకపోయినా అడిగినపుడు సెలవలిస్తూండేదిగా వుండాలి. తరువాత తానుకోరిన యీ షరతులకు బద్ధ పడాలి.

1 తాను కోరినపుడు సినిమాలకుగాని, బీచీకిగాని పుట్టింటికిగాని, అడిగినంతడబ్బిచ్చి పంపవలెను — ఈ వకటిలో బి.

తిరిగి యెప్పుడువస్తావని అడుగరాదు. పైకంగూర్చి లెక్కచూప మనరాదు.

2 తనకొరకై ఆడా మగ స్నేహితులు యింటికివస్తే వారినిచూచి యేమాత్రము అసూయపడరాదు. అడ్డుచెప్పరాదు. అవసరమయితే "టిఫెన్, కాఫీ"లు సప్లయిచేయించాలి.

3 తనకేకారణముచేతనయినా యీపెనిమిటితో కాపురం యిష్టంలేకపోతే విడాకులివ్వటానికి సిద్ధంగావుండాలి. యిందులో బి. విడాకులఖర్చు తమరే భరించాలి. యిందులో సి. తిరిగి వివాహం చేసుకుంటానికి వలయు వ్యవధానంక్రింద మూడుమాసాలకు అయ్యేఖర్చులు స్వయముగాయిచ్చి రశీదులు పొందాలి. యిందులో డి. మీవలన సంతతేదయినా కలిగితే మొదటిభర్తకుమల్లె మీరున్నా మీసంతతిని భరించుకోవాలి.

4 నాకుకలిగే బిడ్డలను పెంచడానికి, పాలివ్వడానికి దాసీలుండాలి.

5 ఎప్పుడుచూచినా అరడజను బెనారస్ సిల్కుచీరెల్సు, పది పంజాబుబాడీలు — పదిహేను జాకట్లు — యిరవై యిస్త్రీ చీరెలు — రెండుడజన్లు చేతిగుడ్డలు — యింకాకావలసినవి నిల్వవుండాలి — స్నోబాటిల్సు, హెయిర్ఆయిల్ బాటిల్సు ఫేస్ పౌడరు బాటిల్సు — లిఫ్టిక్ బాటిల్సు — యింకా యేమడిగితే వాటినందివ్వాలి.

యిలా పెళ్ళిళ్ళబేరికరులు ప్లీడరుగుమాస్తాలలాగా ఫైలు

మీద వేసుకుని ఊరూరూ తిరుగుతుంటారు. ఆడపిల్ల వున్న చోటుకెళ్ళి యికన మొదులుపెడతారా పిల్లాడివారి అయిదారు తరాలవాళ్ళని వాళ్ళ తాతల్ని — ఆ తాతల ముత్తాతలనందర్నీ ఎరిగినట్లు — మరి పెళ్లికొడుకుయొక్క ఘనతను చెప్ప మొదలెడతారు "నల్లనివాడు — పద్మనయనంబులవాడం" టూ, ఆ తరువాత భాగ్య భోగ్యాలగురించి పాఠం వల్లిస్తారు — "మహారాజులు — మార్తాండ తేజుల"ని.

అంతకూరుకుంటారా? ఊరుకుంటే కమీషనెలా వస్తుంది? అందుకని వీధిభాగవతంలో హాస్యగాడు ఆటకు చీటిచ్చే వాళ్ళను పొగిడినట్లు — ఉపాధానం కోసం వచ్చిన బటాౖజు యింటిముందు పద్య మప్పగించినట్లు — వడపప్పుకోసం దసరా గేయాలు చదివే బడిపిల్లాడికిమల్లె "(శ్రీ)హరి కరుణాకటాక్ష!" అని కుర్చీలో కూర్చున్నవాడి నమాంతంగా కొండమీదకెక్కిస్తాడు ' సంబంధం సరైందా! సరదాగా పళ్ళికిలించి పండగ మొగమేస్తారు—కుదరకపోయిందా కొంపమునిగినట్లు దిగులుబడి తిరణాలమొగ మేస్తారు!

అసలీ నడిమింటివారీ నానాతిప్పలు పడటమెందుకు? ఆ పిల్లగలవాళ్ళ వద్దనుండి మళ్లీ యీ పిల్లాడిగారింటి కొస్తారు. "ఓవ్! పిల్లకేం? వరాలబొమ్మ. మీలాంటివారి యిళ్లలో ఆ పిల్ల వుండదగింది సుమండీ!"అని పొంగిపోయి బోర్లపడి లేత లేతవాటన్నిటినీ కోసి పారేస్తారు.

సరే పెళ్లిముగుస్తుంది. "అయం ముహూర్తం సుముహూర్తోఅస్తు" అనేవరకూ అటువచ్చినమాటల్ని, యిటువచ్చిన మాటల్ని యీ మధ్యవర్తులే సాక్షాత్ సాంబమూర్తిసంపూర్ణావతారందాల్చి, గంగా కాలకూటముల భరించినభాతి భరిస్తారు. కార్యస్తులెంత మధ్య మధ్య కేకలు వేయబోతున్నా వీళ్లు వాళ్లనోళ్లు నొక్కిపట్టి "కాస్త వూరుకోండిబాబూ! ఆనాలుగక్షింతలూ పడనివ్వండి. తరువాత మీమీ ప్రతాపాలు చూపించుదురుగాని" అని సమాధానం చెబుతూంటారు.

ఏ పక్షంవారి కేలోటుజరిగినా, చివాట్లువేసి "యేమయ్యా! ఆనాడేమో త్రవ్వి తలకెత్తుతారంటివే! — నీమాటవిని మేమీ దిక్కుమాలిన చుట్టరికాని కొచ్చేంకాని, మాకేం గతిలేకొచ్చామా" అని యెనేమో చివాట్లు పెట్టుతూంటే "పాపాలకన్నింటికి భైరవుణ్ని నేనే"లెమ్మంటూ తలూంచుకొని — యీ మాటలు తక్కినవాళ్లు వినకుండా వాళ్లకంటె కొంచెం పెద్ద ధ్వనిలో "వషట్కారత్వం, యింద్రత్వం, విష్ణుత్వం, బ్రహ్మత్వం, ప్రజాపతిః"అనుకుంటూ సరిపెట్టుకుంటారు.

ధనసంపాదనకోస మయ్యోగా యిన్నిపనులు చేయటం! ఈమధ్యనో వూళ్లో నొకాయన వున్నాడు. అతనిభార్య భర్త నపుంసకుడంటూ వదిలిపెట్టి పోయింది. "చెలిమి చెడిపోతేగాని చెడ్డతనం బైటకురాద"న్నారు కదండీ! పెళ్లాంకంటే మిక్కుటంగా భర్తకూడా భార్యలోపాలనెత్తి పెద్ద పాతరవేశాడు. అంతవరకు తన పరువు మరియాదలను కాపాడుకొనే పనే—అంతటితో

వ్యాపకోక వొక దుర్మార్గునిచూచి తన కెలాగనైనా మళ్ళీ పెళ్లి చేసుకోటానికి పిల్లను కుదిరిస్తే రెండువందల రూపాయలు లంచ మిస్తానని ఆశపెట్టాడు.

పాపమీా పుణ్యాత్ముడా రెండునందలరూపాయలకాసించి మరోపిల్లగొంతు కోయాలనుకున్నాడు. ఎత్తుగడ వేశాడు. తనకు ముఖ్య బంధువులమ్మాయికి పాపం పసితనమందె తండ్రి చనిపోయినందున తాత ముత్తవ్వలయింట పెరిగింది. ఆ తాత ముత్తవ్వలీయనకు చాలా దగ్గిరవారయినందున పోయి తాను రెండువందల రూపాయలు లంచమాసించిన సంబంధంమీాదగల ఆశతో "ఆ వాడుక కేవలం మొదటిభార్య కల్పించినదె కాని, నిజంకాదని — తాను బాగా విచారించాన"ని చెప్పడంవలన నమ్మారు. పెళ్ళికూతురుగూడా యీాయనగారి మాటలు నమ్మింది.

పెళ్ళయింది. పెనిమిటిగార్కి పెళ్ళాన్ని చూస్తే పెద్దద య్యాన్ని చూచినంత పనవుతూంది. ఆరుమాసాలామ్మాయి వోర్పుపట్టింది. చివరికోనాడు పట్టుపట్టితే భర్తగారి బండారం బైటపడింది. మొదట తనసవతిపడ్డ గోతిలోనే తానూబడ్డది. తరువాత యీామోసమేమిటని నిదానంగా విచారిస్తే రెండు వందల రూపాయల మహాత్యమని కంచుగంటమీాద కొట్టిన దెబ్బలా ఘల్లుమన్నది. నిజానిజాలు నేముమాత్రం కళ్ళతో చూచామనటంలేదు కాని, నెత్తిమునిగిన నిందగలిగింది. ఒక వేళ అదే నిజమయితేమటుకు తాను సంపాదించిన రెండువంద

లగూపాయలు రెండునెలలలోనే అయిపోయినా యీ వాడు మటుకు యీలోకంలోనే కాకుండా, చచ్చాక స్వర్గలోకానికి గూడా వీరియుడ్రిసు పేరుతో రవాణా చేయబడుతూంది. ఈ మాట మీ కేమన్నా యెగతాళిగావుందా? వుండదండీమరి — యిలాంటివారికి స్వర్గప్రాప్తి వొకటుంటేగా వీరిసొత్తు స్వర్గానికి యెగుమతిచేయటం — పోనీ, అలాంటప్పుడు యమలోకానికే అనుకొందాం.

వివాహానంతరం జరిగే విధానమింకొకటుంది. దానిని "అరిణం" అంటారు. "అరిణం" అంటె అర్ధమేమిటో తెలుసా? పనీపాటా లేకుండా పెట్టినవన్నీ తిని కూర్చొనటం. ఇందుకు సామాన్యంగా వొకసంవత్సరం — అర్ధసంవత్సరం — కనీసం పాతికసంవత్సరం యిలా పరిమితి యుంటుంది. అందుకనే యెవరయినా దిగులూ విచారం లేకుండా భోంచేస్తూ బలిసి పోయేవారినిచూచి "అల్లెపుపెళ్ళికొడుకులా బలిశాడం"టారు.

ఈ యరిణపు మరియాద బ్రాహ్మణులలో మరింతగా కానరాదు. ఏదో పదిరోజులపాటు మరియాదగా వుంచుకొనటం, శక్తియున్నటులుగా గౌరవించిపంపటం జరుగుతూంది. ఈవివాహాలు సామాన్యంగా మాఘమాసంలోను, చైత్రి వైశాఖ, జ్యేష్టమాసాలలో మిక్కుటంగా జరుగుతుంటాయి. పెళ్ళయిన నాటినుండీ నూనతవరు డత్తవారింటిలో బడి ఆంబోతుమల్లె మేస్తుంటే— "మామగారింట మరియాదకు లోటవుతుందో"మోనని, అప్పయినాచేసి పప్పుకూడుబెట్టి— ఆఖ

రుదశకు అక్షయపాత్రిదాకా వస్తుందేమోనన్న సందేహంచేత కాబోలు "పెళ్ళయినసంవత్సరం అత్తా అళ్ళుళ్లొక గడప దాట రాద"ని ధర్మశాస్త్రమొకదానిని దెచ్చి అమాంతంగా అడ్డం వేశారు.

ఈయాషాఢమాసంలో క్రొత్తళ్ళుళ్ళు గ్రిహణంబట్టిన సూర్యుడులా కళ్లుమూసుకొని కాలం జరుపుకొంటూరు. ఆకాస్తా అడ్డుతీరంగానే అత్తవారింటిమీద బడతారు. కోరినభోజనం— చాలినవస్త్రం — అవసరమైన సౌకర్యాలు — అందమైనపెళ్లాం వుంటే యిల్లూ తల్లీ తండ్రి యెవరికికావాలి? తన్నే తాను మరిచేస్థితిలో తనవారినెందుకు మరచిపోరు? చివరకు విసిగెత్తి మామగారే "నీపెళ్లాన్ని తీసుకొని నీయింటికిపోవయ్యా!" అని అన్నా — "శుక్రివారంపూట ఆడపిల్లను పంపించడం మీకు సక్రమంగాదు — శనివారం దుర్ముహూర్తంతో ప్రారంభంగాబట్టి ప్రియాణయోగ్యంగాదు — ఆదివారం అందరికీ ఆటవిడుపురోజు — సోమవారం చుక్కెదురు — మంగళవారం మా యింటిపేరటివారికి జయంకాదు — బుధవారం వులయినా బయలుదేరదు — గురువారం, గురువారం"అంటూ గుర్తిల్లు మిటకరించకుండా వుంటానికే యీనిబంధన మనవాళ్లు పెట్టారేమో.

కమ్మవారిలో యీ యాచారం బాగా కనుపిస్తుంది. క్రొత్త అళ్ళుళ్లు అత్తవారిళ్ళలో బిడియ పడుతుంటూరు. ఆ బిడియంవదిలి కాస్త స్వతంత్రం గలగటానికి, అంటె డైరెక్టుగా పెళ్లాం కాకపోయినా, యే వదినగారితోనో, యే అత్తగారి

తోనో కాస్త చనవున్నారికిందాకా యీ కొత్తల్లుడివెంటనొక పరసనల్ అసిస్టెంట్ పేరుతో ఆక్టింగ్ వేకెన్సీ నొకదానిని రిజర్వు చేసేవారు. ఈ పరసనల్ అసిస్టెంటుగారినే మనవారు తోడల్లుడనే పేరుక్రింద చలామణీ చేస్తున్నారు. ఒక్కొక్కమారీ సీటు కోసం అప్లికేషన్స్ దాఖలు చేసేవాళ్లు దొరకకపోయినందువల్ల వార్తా పత్రికలలో ప్రకటించినంతపని జరిగేది.

ఇప్పటికిమల్లె అవు డింతగా నౌకరీలకోసం ట్రైచేయనక్కర్లేదు. నౌకరీచేసేవాళ్లకే మాంచి-డిమాండ్ వుండేది. ఈ రోజుల్లో ఆ ఛాన్స్వస్తే నాలుగురకాలా నమిలిపారేస్తారనటం అబద్ధమా? అప్లికేషనుల కంతుంటుందా? రికమెండేషన్లకు విరామ ముంటుందా? అయినా ఈ కాలేజీ క్వాలిఫికేషన్ వారికి పనికిరాదుకూడాలెండి. ఆ నాలెడ్జీవేరు — ఆ యెక్స్పీరియన్సు వేరు.

"అయితే యింతకుముందు అల్లుడి మంచితనమంటూ వుండదని చెప్పారుకదా" అని మమ్మడుగుతారేమో? అందులో అబద్ధంలేదు. ముందు మురిపెంగా కొన్నాళ్లు జరిగాకగాని, ముదురుపాకంలో బడదు. మొదట్లోనే యిలావుంటె అసలు సంబంధం యెలా కలుస్తుంది? మొదట్లో యెంతైనా మోజుగా వుంటుంది. అంచేత యే దగ్గరవారైనా వియ్యమందబోయే వారిలో కళంకముంటే చెప్పవచ్చినవారికి చివాట్లువడ్డిస్తారు.

"వచ్చిననాడు వరాచుట్టం, మర్నాడు మాడాచుట్టం, మూడోనాడు మురికిచుట్టం" అన్నట్లు క్రమంగా గౌరవాభిమా

నాలు మారుతూంటాయి. కాదనేదేముంది? పుట్టిననాటి సంతో షం—పెళ్ళినాటి ప్రేమ—చచ్చిననాటి దుఃఖం శాశ్వతంగా వుంటుందా? అంచేత మొదట్లో అల్లుడంటే — "కొండకంటే గొప్పవాడు—బండకంటె బలమైనవాడు—నిప్పుకంటె నిష్ఠ గలవాడు—మిరపకాయకంటె చురుకైనవాడు—దూదికంటె మెత్తనివాడ"నుకొంటారు. అల్లుడంటె సాక్షాత్ ఆకాశంనుం డూడిపడ్డ అమర పురుషావతారం. అల్లుడిదర్జా అందాకా లెక్క తుంది—అందాన్ని చెప్పాలంటె "చిదిమినపాల్గారు చెక్కుటద్ద ములపై జిలిబిలి చిరునవ్వు లొలయువాడం"టారు. గుణగణాలను గురించి చెప్పాలంటె "అలుగుటయే యెరుంగని మహా మహి తాత్ము"డంటారు — శక్తిసామర్థ్యాలు చెప్పాలంటె "సురలు కరుణింప జరుగని చోద్యమున్నె?"అంటారు.

ఈ సరసం విరసమయ్యాకనేగా "కులమా? గోత్రమా?" అని పేర్కొటం — తరతరాలవాళ్ళ తప్పులెతకటం — "కర్మం చాలక గోతిలోపడ్డా మను"కొనటం — తాతా మనుమళ్ళ నరస లలోకి దిగటం. తరువాత పిల్లను పంపననటం — పదిమంది చెప్పటం — తండ్రిమాటకు కూతురు తలవంచటం — అల్లుడు మరొకభార్యను సంపాదించటం — మొదటిభార్య మొఖం మాడి పిల్లిలా పెనిమిటింటికి రావటం — "పిల్లనిచ్చుకొన్న చోటికి, పెంటదిబ్బకుపోక తప్పుతుందా"అని మామగారు మళ్లీ అల్లుడిగడప త్రొక్కటం — అల్లు డడగవలసినవి నాలుగూ అడిగి కడగటం "కొండ లద్దమందు కొద్దినైయుండవా? విశ్వ

దాభిరామ వినుర వేమ''అంటూ చేతులు పట్టుకొని కాళ్ళను కొమ్మనటం — "నీకేం యెన్నిసార్లయినా పట్టుకొంటావు. పెళ్లినాడు కడిగిన కాళ్ళేగా యివ్వాళా పట్టుకొంద''నటం — యిల్లాలునవ్వటం — యిద్దరూ యేకంకావటం — మొదట్లో చాడీలు చెప్పినవాళ్ళమీదపడి ముక్కుకుమట్టికాకుండా మూడు పొర్లిగింతలు పెట్టించటం జరిగేది.

ఇపుడీ నడమంతరపు కాలంలో అలా బ్రతిమిలాడేవాళ్లు లేకుండాపోయి —"యీమనకాకపోతే యింకో పెళ్ళి చేస్తానం" టూను. ఈమధ్య జీవితంసినిమాలో విన్నారే— "నేను తలుచు కుంటే రేపీపాటికి లక్షా తొంభై తొమ్మిది మందిని తెచ్చి మా అమ్మాయికి కట్టబెడతాన''ని ఎ, శివశంకర గంగేశ్వరప్రసాద్ గారు శెలవిచ్చినట్లు...

యిలా చేసే చేసే కాపరాలతీసే మామల పులుసునీళ్లు వంచటానికై అల్లుళ్ళపై కనికరముంచి గవర్నమెంటిపుడు భార్యా భర్తలిద్దరూ యిష్టపడకుండా— వారితలు లేకుండా మళ్ళీ పెళ్లి చేసే తండ్రులకూ — అందుకు సంబంధించినవారికీ కారాగార ప్రాప్తి బహూకరిస్తుంది. ఈ దెబ్బతో దయ్యం బారిపోయి "మాకేం భరణం వొదులుకొంటాం''అనే పైచూపు సారా డ్రాగినవాడి నిషాలా దిగిపోయింది.

అందుకని మొదట్లో అతి గారాబంగానే వుంటాను. ఆరోజుల్లో అల్లుడుగారు బయటకువెళ్లాలన్నా వెంబడి మరొకరు

నీళ్ళచెంబు పట్టుకపోవలసిందేకాని, అతనిని మాత్రం పట్టుక పోనివ్వరు. ఇండ్లలో అల్లుడుంటె చాలామందికి దొడ్లో పాడిగేదె వుండాలి. ఆయింటి కెవరయినాబోయి "మీయింట్లో నెయ్యి దొరుకుతుందా?" అని అడిగితే — "ఏమ్పే మాయింట్లో అల్లుడుంటె నెయ్యి యెక్కడిదీ నీకు తెలియకుండా" అంటారు. యింట్లో అల్లుడు—దొడ్లో గేదె — చట్టిలో నెయ్యి, యీ పాడు గాయనకు తెలియాలిసిన పనేమిటో ?

ఓనాడో యింటి అరుగుమీద ఆ యింటియల్లుడు, తోడల్లుడు కూరుచుని మాటాడుతున్నారు. ఇంతలో మరొక పొరుగింటాయనవచ్చి "యిందులో మీ అల్లుడెవరయ్యా ?" అని యజమానిగారి నడిగితే, ఆ మామ వ్రేలితో చూపుతూ "యిదుగో యీయన మా అమ్మాయి మొగుడు — యీయన నా మొగుడు" అన్నాట్ట. పాపం. ఆయన యీ రెండు శాబ్దిక భావప్రసరాల ధాటికి తట్టుకో లేకపోయి తలవాచి చచ్చి — సగ మయ్యాడన్న మాట.

తోడల్లుడు — తోడల్లుడంటె; షడ్డకుడని అర్థంచేసుకుంటారేమొ!—అలాగా అయితే యింకేం! అత్తవారింటిలో అల్లుడన్నతర్వాత అందరినీ సమానంగానే చూట్టం సామాన్యంగా వుంటుంది కదటండీ! అలాగైతే, అదీవొక అందమే——

క్రొత్తల్లుళ్లు అత్తవారింటిలో సిగ్గుపడుతుంటారని మన వాళ్లు చెప్పుతుంటారు. ఓ అల్లుడు యింటివద్ద సమృద్ధిగా తినే

వాడే-అత్తవారింటిలో నాజూకుగా భోంచేయాలనుకున్నాడు. మొదటిరోజు అత్తగారు మామూలుగా వడ్డించారు. అల్లుడుగారు మరియాదకుబోయి వడ్డించినదానిలో కొంచెంగా వదిలిపెట్టాడు. మర్నాడు అత్తగారు కొంచెం తగ్గించి వడ్డించారు. మర్నాడుకూడా యీయల్లుడుగారు కొంచెరి అన్నం తక్కువయినాసరేనని ఆవడ్డించినదానిలో మరలా కొంచెం వదిలిపెట్టాడు ఆమర్నాడు మళ్ళీ అత్తగారు తగ్గించివడ్డించారు. ఆమర్నాడుకూడా అల్లుడుగారు సగం ఆకలితో లేస్తూ కొంచెం వదిలిపెట్టాడు ఇలా వారంజరిగేసరికి అరసోలెడు బియ్యం తినేవాడు అరగిద్దెడుకంటె అన్యాయంలోనికొచ్చేడు.

సరె భోజనాలలో యిలా పొట్టకు ముడుపుకట్టినవాడు ఫలహారాలుమాత్రం సరిగా పుచ్చుకుంటాడా? కట్నాలనాడు చూపించిన గట్టితనం పట్టుదలగా ఫలహారాలలో యెందుకుండకూడదు? అత్తవారింటిలో అడిగి వడ్డించమంటె అదో చిన్నతనం గాబోలు యీ నవనాగరికులకు?-

ఆ అత్తగారుకూడా యీ యల్లుడుగారికి సరిపోయిందే- ఇరుగమ్మనూ-పొరుగమ్మనూ పిలిచి "ఒసే-సుబ్బమ్మా! సూరమ్మా! మా అల్లుడు యెంత నాజూకుగా భోంచేస్తాడో చూచారంటే? తాటికాయంత వడ్డిస్తే; దబ్బకాయంత తిన్నాడు—దబ్బకాయంతవడ్డిస్తే, నిమ్మకాయంతతిన్నాడు-నిమ్మకాయంత వడ్డిస్తే కుంకుడుకాయంత తిన్నాడు-కుంకుడుకాయంతవడ్డిస్తే; కందిగింజంత తిన్నాడు.. మా అల్లుడికెంత కావాలమ్మా! నాలు

గంటె నాలుగుమెతుకులన్నం—నాలికకు రాసుకొన్నంత కూర—చిట్టెడు చల్లనీళ్ళయితే మా అల్లుడికి తినలేక తేలగుడ్లు పడతా యం"టూ చెప్పతూంటే కర్మంచాలక ఆ నవనాగరికుడు విన్నాడనుకోండి. ఇకెలా అడగటం? తినటం?

ఆరోజా అత్తగారు కొబ్బరిబెల్లం తొక్కు ఫలహారం పెట్టింది, అదికూడా నాజూకుగానే తిని వతిలాడు. కమ్మగా వున్న కొబ్బరీబెల్లం తినాలని భ్రమంగావుంది. అడుగుదామా సిగ్గేస్తుంది. అందుకని యెవరూలేకుండాచూచి— యీ కొబ్బరీ బెల్లం త్రొక్కు—నరోలు నాకబోయాడా అల్లుడు. "తానొకటి తలచిన బైవమొకటి తలచె"నన్నట్టు "యెవరికీ తెలియకుండా యేదోకాస్త రోలు నాకపోదాఁగదా"అనుకొన్న కొత్తల్లుడి తలకాయారోటిలో యిరుక్కునిపోయి చిన్నాపెద్దలకు తెలిసి పూగూనాడూ పోగయేంతవరకూ వచ్చిందీవ్యాపారం, రోళ్ళు పగులగొట్టో —రోకళ్ళు పోగువేసో, చివరికెలాగో "మా అమ్మాయి తాళిబొట్టు గట్టిదయినందున మాఅల్లుడుతలకాయి బయటపడిందమ్మా"అని చెప్పకొనే స్థితికొచ్చింది.

ఈయనగా రిక్కడిలా వాయుస్తంభన — జలస్తంభన చేస్తూంటే అసలింటివద్ద అమ్మా నాన్నా వాళ్ళందరు "మా అబ్బాయి యింకాయెంతబలిసివస్తాడో? యెంతబలిసొస్తాడో?" అనుకుంటుంటారు. "ఆశపడి ఆసులంకణాలు చేసినా ఆరోజా జొన్నకూడో"నని అత్తగారింటిలోగూడా ఆ అల్లుడికి అంటుక పోయినదొక్క లేవదాయె. చూచినవారంతా చోద్యంలా

చుట్టూ మూగి "అదికాదురా! అత్తవారింటిలో అల్లెంతినటానికి పోయి అడ్డం బలవవలసినవాడి విలా అస్తిపంజరంలా తయారయ్యావ"ని నవ్వారు.

కన్నతల్లి కడుపుమంట పట్టలేక యీపరాలిని చూచి "యి దేమిటమ్మా! నీపెట్టు పెటాకులుగాను నాబిడ్డనిలా నాయి కట్టించావ"ని మెటికలు విరవంగానే "యిరుగికటి యీరమ్మ-పొరుగింటి పుల్లమ్మ. నాహూతురుకాపగం చూడాలిసొస్తుందని నాఅలుడికి దిష్టిపెట్టారమ్మా!"అని అమాంతంగా ఆవేశం పెరిగినవాళ్ళకుమల్లె విరుచుకొనిపడి-చూరుల్లోదోపివ వెంట్రుకల తుట్టెలు, యింత వుప్పా—గుప్పెడెండుమిరపకాయలు తెచ్చి దిష్టితీయటమంటూ చుట్టూ. తిప్పాతూఅలుడి నెత్తినకాస్త—ఆ తిప్పే తొందరబో తన మొఖానకాస్తపడగా మిగిలినవాటిని యేమంచినీటి కుండలోనోపోస్తే మళ్ళీ తెచ్చుకోవలసొస్తుందనీ-దగ్గరలోనున్న బావిలో పోయటం-మరునాడు చేదవేసినవారి మంచినీళ్ళలో యీ వెంట్రుకలతుట్టె శివుని జటాజూటములు ప్రత్యక్షంకావటం జరుగుతున్నాయి.

అందుకని అలుడికో అసిస్టెంట్ అవసరమయ్యేవాడు. కలెక్టరాఫీసుకుపోయినవాళ్ళు తొలిసారిగా గుమస్తాఫీజు సమర్పించినట్లు—దేవాలయములో మొదట అర్చకుడికి దక్షిణవేసినట్లు — విలాసకాంతదగ్గరకు పోయేటప్పుడు తొలుత వేశ్యమాతఫీజు చెల్లించినట్లు అలుడికి మరియాదలు చేయబోయే ముందు ఆయనగారితత్వం తెలుసుకొంటానికి ముందీ అసిస్టెంట్

గారిని గౌరవించాలి సొచ్చేది. మొదటమొదట యీ సహాచ రుడా పెళ్ళికొడుకుకు చాలా అనసరమే కాని, రోజులు జరిగే కొందీ—అంటే ఆడామగతో కాస్త మాటామంచీ యేర్పడే. కొలదీ సలహాదారుడు అలుడికికూడా అడ్డు అయిపోతాడు.

"ఊరుఅందం గోడలుచెప్పుతాయి—మనిషిలో తేట మొగం చెపుతుందనిని చెప్పడమెందుకు? ఈవాలకంచూచి ఆ తోడలుడు "అనువుగానిచోట నధికులమకరాద"ని చల్లగా యింటికి చేరుకొంటాడు.

"అలుడు సర్వస్వతంత్రుడ"ని యింటిఅలుడికెంతయినా పెడతారు. వాళ్లు పెడితేమాత్రం తినటంయెలా? తింటె అరగ టంయెలాగా? ఎలాగో యీయనగారిక్కడ వార్షికోత్సవం జరి పించుకొని యింటికి వెళ్ళినతరువాత చాలామంది మంచమొక్క లంకణాలలీష్టు అత్తవారింట్లకు పంపిస్తుంటారు.

ఇక కొందరు పశువర్గానికి చెందినవారున్నారు. అలు డంటె కేవలం కన్నబిడ్డలాంటివాడని మన భారతీయధర్మం. యదార్థానికి ధర్మమేకాకుండా చీమూ నెత్తురులున్నప్రతివారికీ జ్ఞానం జన్మలోనే కలుగుతూంది. కాని— దాన్నిమరచిపోయి పశువులకంటె హీనంగా మానవత్వానికి కళంకంచేకూర్చినవా రున్నారనటానికే సిగ్గుబడి తలలువాలుస్తున్నాం. ఏవిషయాన్ని గురించయినా యదార్థం చెప్పేటప్పుడు దూషణ భూషణలు మానములుగా భావించి నిజం చెప్పాలిగదా?

ఒకగ్రామంలో యిలాగే అల్లుడత్తవారింటిలో అల్లెంతిం టున్నాడు. మామగారేదో పనిమీద బయలుదేరి పోనుగూ ళ్లారు. నిండుపున్నమినాటి వెన్నెలలో హాయిగా నిదురబో తూన్న అల్లుడి మోమోమారు చూచిందాఅత్తగారు. "ఆయ నలేదు గ్రామమున" నన్నమాటను తలుచుకొంది. తానాడ బోయే నాటకం అపర విషాదసారంగధరో? ప్రత్యక్ష తారా శశాంకమో తనకే తెలియలేదు.

సాహసించింది—సమీపించింది—తట్టిలేపింది. తటాలు నలేచాడు—కంగారుపడ్డాడు. కంగారుపడ్డవాడ్ని కౌగిలిలో వేయాలని ప్రియత్నించింది. అదేమిటో—ఎందుకో. అల్లుడికి అర్థంకాలేదు. మనసులో కళంకమేలేకుండా మైమరచి నిద్రించే వాడికీవిషయమేం తెలుస్తుంది? ఎలా తెలుస్తుంది. అసలు తనయె దుటనిలుచున్నది అత్తగారని యెలాఅనుంటాడు? యెందుకను కొంటాడు. అమాంతంగా పొలికేకవేస్తూ గాభరాపడ్డాడు. ఆ గాభరాలో చెయ్యెలా తగిలిందోకాని అత్తగారు చతికిలబడ్డారు. "పాటునకింతులోర్తురె కృపారహితాత్మక!" అంటూ "వీర నారీమణీరీవి విశదపరచె." నాయత్తగారు.

ఇంతలో యిరుగు పొరుగిండ్లలో నిదురించువారలీ యిం టిలో దొంగలేపడ్డారో, దోపిడేచేశారో అని "సమరసన్నాహు లై, ఆయుధపాణులై కదనభూమి జొచ్చిన కాల్బలంబువోలె" యింటిలోనిండిపోయిరి. ఇచట "వనిత తనంతతా వలచివచ్చిన చౌకయటంచు బల్కరే"యని బిత్తరవోవుచున్న అత్తగారి తత్త

రచిత్తమెరింగినవారై "వినాశకాలే విపరీతబుద్ధిః" అనుకొని నిట్టూర్పులతో నెమ్మదిగా వచ్చినదారినె పట్టారట.

ముఖ్యమయిన సంగతొకటి మరిచిపోయాం. అదేమిటంటే — మొదటిమాట పిల్లల్ని పెంచే పద్ధతులదగ్గరనుండీ మన దేశానికి యితరదేశాలకూ తారతమ్యముంది. అభ్యుదయమందిన సాటిదేశాలలో తమబాలురకు పాడే జోలలదగ్గరనుంచీ మురుసుకొనే ముచ్చట్లవరకూ పురోభివృద్ధికి పునాదులె. "మా అబ్బాయి పెద్దవాడయితే గొప్పయంత్రాలను కనిపెడతాడు — మావాడు దేశాంతర వ్యాపారం చేస్తాడు—మాబాబు చంద్రమండలాన్ని భూమండలానికి తెస్తాడు"అనే విజ్ఞానవీధులలోనే—వీరపంథాలలోనే—విశాలహృదయాలలో వారిని విహరింపచేస్తారు. అంచేత వారికా విఖ్యాతజీవితంబులు వెన్నతోబెట్టిన విద్యలైపోయాయి.

మనవారిమార్గ మదికాదు. అబ్బాయిని నిదురపుచ్చటానికి జోలలుపాడుతారు. "బాలానాం రోదనం బలం"అని తెలిసినవాళ్లెందరో పిల్లాడు కేవ్వమంటే కుక్కి—మెడలు పడిందాకా చంకల్లో కూలేస్తారు. "నాన్నా! యేడ్వకే"అంటూ నల్లమందు పోస్తారు."అబ్బాయియేడ్వలేద"ని ఆనందపడతారు. "నల్లమందు తిన్నానా, నాలుగందాల చెడ్డానా"అన్నమాట మనవాళ్లు చిన్ననాడే మరచిపోయారు. కర్మించాలక వాడుకాస్తా కన్నుమూస్తే "యేడ్చేవారి యెడమచేతికిందా కుట్టేవాళ్ళ కుడిచేతికిందా వుండరాదన్నారన్న"సామెతను సార్ధకంచేస్తూ యింతైతే చీదివేస్తూ

"మనం చెట్టుదగ్గరికిపోతే మంచికాయను కోసుకొంటున్నట్లు దేవుడుకూడా దోసపండులాంటి బిడ్డనే యెత్తుకపోతాడమ్మా!" అని గంపెడయితే యీాయపనిందను కట్టగట్టి నోగూ వాయి దేవుడునెత్తిమీాద విసురుపుచ్చుక పారేస్తారు.

"అడుగులోనేహంసపాద"మన్నట్లు మొట్టమొదట జోలపాడట మేవొక అపహాస్యం. "చిచ్చోచిలయీా-అబ్బాయినెవరూ, కొట్టేనవారూ"! అని మొదలెడతారు. అంటే మనవాడెపుడు చూచినా వొకరిచేత దెబ్బలుతినేవాడేకాని వొకరిని కొట్టగలవాడుకాదన్నమాట. తరువాత"కొట్టేనవాళ్ళనూ తిట్టేవద్దామూ" అంటారు. ఈయర్థం యింకా అర్థ్వాన్నంగా వుంది. వాళ్ళకు చేతులాడితే మనకు నోరాడుతూందని వీరిభావం. దీనినిబట్టి మనవాళ్లు వాచాశూరులన్నమాటే కాని — బాహుబలాఢ్యులన్నమాటకు బలమివ్వడంలేదు. అయితే మనవారు "శాంతం సజ్జనలక్షణమ" నే గాంధీసోదరులా? అలాంటప్పుడీ శాపనార్థాలపంచాగం విప్పడమెందుకు? పోనీ—ఆతిట్టడానికైనా కలేజాచాలక తనవాళ్లెవరో యింకారావాల్నట—"తిట్టేవద్దాం" రాండి! అనిపిలవటం వీరినికొట్టినవాళ్లు "నిన్నుకొట్టితే నీయబ్బవెనకాళ్లెవరు వస్తారో చూస్తా"నంటే — "యిరుగో చూడమనిచూపించటానికి తీసుకెళ్లినట్లు.

పిల్లలనాడించే టప్పుడిక "బూచీ" అనిభయపెడతాడు. పిల్లలకీపిరికిమందు తల్లిదండ్రులేపోస్తున్నారన్నమాట. "బూచోడ రారా! బుట్టెల్లుకోరా! బుట్టలోమాఅబ్బాయిని పెట్టూకపోరా!"

అని మరో తెలివితక్కువపాటను అత్యావశ్యకముగా నుపయోగి స్తాను. అంటే మనబ్బాయిని పరాయివాళ్ళ బుట్టలో పెట్టకోవ డమే మనకుకావలసిందన్నమాట. అర్థమయిందా? మనముద్దుల య్యకంటే అసమర్థు లింకెవ్వరుండ గూడదని పెద్దవారిసంకల్పం.

మరికొన్నాళ్లుపోయేక యింటికో చుట్టంవస్తాడు. కూర్చొ ని అంతా కులాసాగా మాటాడు తుంటారు. మాటలమధ్యలో కొడుకొచ్చి మారాం వేస్తుంటాడు "ఒరేయ్ బాబూ! అడుగో మామొచ్చేడుకాని— పిల్లనిస్తావా లేదా అనిఅడగరా!" అం టూ ముద్దుగా నేర్పుతాడాతండ్రి. "మామా, పిల్లనిత్తావా"? అంటాడా ముద్దులకొడుకు "ఛాతంతానాయూలా!" అంటాడా పెద్దమనిషి. మీనాన్న నేర్పినలాంటి సంస్కృతవాక్యం నేనొకటి నేర్పుతానని. మరునాడు యెవరయినావచ్చి "బాబూ! మీ మీనాన్న గారింట్లోవున్నారా?" అనిఅడిగితే పాపం యీబాలు డేమంటాడు? ఏమంటానికీ చేతనయితేగా— నిన్న మామగారు నేర్పిన మహోపదేశ వాక్యా నిక్కడికి ట్రాన్స్ఫర్ చేస్తాడా "ఛా తంతా నాయూల"న్నమాటనే—

ఇంతలో తండ్రిగారు రానేవస్తారు. అబ్బాయి నాటక మాంతంగా చూచి ఆంజనేయస్వామియైపోతాడు. "అమ్మ నీకు బువ్వాయి పెట్టలేదంటేనాన్నా! అడుగుదాంరా యెందుకు పెట్ట లేదో? అమ్మనుతన్ని బువ్వాయి పెట్టించుకుందాం— అమ్మను తన్నే కాలేది?"అంటూ చంటివాడికాలుపట్టి ముద్దెట్టుకుంటాడు.

నడవకముందిలా తయారయిన కాలు కాబట్టే నడుననేరి చాక మనవాళ్లు పప్పులో కాలేస్తుంటారు.

చూడండి! ''అమ్మనుతన్నే కాలేదిరా?'' అనకపోతే "అమ్మకు నమస్తే చేసే చెయ్యేదిరా బాబూ!'' అంటేయేంపోయింది? పోనీ తండ్రిగదా; తనకైనా నమస్కారం చేయించుకొని శుభాశీస్సులిస్తున్నాడా? అదీలేదు — "మాతృదేవోభవ-పితృదేవోభవ—గురుదేవోభవ" అనేమాటలు నేర్పితే నోటిముత్యాలు రాలిపోతాయా? మహాపాపంవచ్చి మారిలాగా పట్టి పీకుతుందా? అసలాయనకలవాటువుంటేగా అబ్బాయికినేర్పటానికి? కాబట్టే "తల్లి విషమాయె—పెళ్లాముబెల్లమాయె" అన్నచందంలో బడిపోయిందీలోకం.

ఆడపిల్లల్ని పెంచడంలోనున్న అవకతవకల్ని కూడా చెప్తున్నాం. వరసఅయినవాళ్లంతా పొత్తిగుడ్డల్లో వొత్తిల్లే నాటినుండీ చతురుబాణాలు విడుస్తునేవుంటారు. వాళ్లుకాస్తపెద్దవాళ్లయ్యాక కొంతమందిపిల్లలొకటై బొమ్మరిండ్లుకట్టటం—బొమ్మలపెళ్లిళ్లుచేయటం—వూరేగింపులుచేయడం—వూరబంతులకుపిలవటం యిలాంటి ఆటలాడుతుంటారు. ఈబొమ్మలు తాటాకులివికొన్ని—కొయ్యవికొన్ని — కోటప్పకొండదగ్గరకొన్న పేడబొమ్మలుకొన్ని రకరకాలు వుంటాయి. వాటికిచిన్నచిన్న గుడ్డముక్కలుచించి తమాషాగా బట్టలు తయారు చేస్తారు. బుల్లి బుల్లి జడలల్లుతారు. వాటిదగ్గర వచ్చీ రాని పాటలు పాడుతారు.

ఈ నవ్వులు నువ్వులవుతాయి. ఎక్కడనో కాస్త పేచీ వస్తుంది. అక్కడనుండి జిలాయి లేసుకుంటారు—పార్టీలు యేర్పడుతాయి — "నాకందిపప్పు నాకుపెట్ట"మంటారు—వాళ్లదగ్గరున్న కందిపప్పు పెట్టబోతారు "అవినాకెందుకు? ఇందాక నేనుపెట్టితే నీవుతింటివే నాపప్పే నాకు కావాల"ంటారు — దీనికితీర్పు దేవేంద్రుడయినా చెప్పలేడు. "దొంగను పట్టడానికి దొంగేకావాల"న్నట్లు పిల్లలతగవులు పిల్లలేతీర్చాలి. కందిపప్పు తిన్నమ్మాయి కొంచెమాలోచించుకొని "నిన్న నేను నీకిచ్చిన బొమ్మనియ్యమ"ంటుంది. "ఇదిగోతీసుకొమ్మ"ని యీఅమ్మాయంటుంది. ఇవ్వాళ నాకెందుకు? నాకు నిన్ననే కావా లంటుంది. ఇసుక తక్కెడకు, పేడ తక్కెడకు సరిపోతుంది. ఇండ్లకు చేరుతారు.

కొంతమం దలాకాకుండా కలబడి కొట్టుకొంటారు — గోళ్ళతో చీల్చుకుంటారు — పళ్ళతో కొరుకుతారు. పిల్లల తగువులు పెద్దవాళ్ళదాకా పోతవి. మరియాదస్తులు వాటిని చల్లగా మాపుచేసుకొంటారు. కొంతమంది ఆయింటిమీద కాకి యీ యింటిమీద వాలనియ్యరు. కొంతమంది పగలంతయూ తగవాడుకొని సాయంత్రానికి మళ్ళీ అరుగులమీదచేరి లోకాభిరామాయణం మొదలుపెడుతారు. ''నీకు సిగ్గులేదు, నాకు యెగ్గులేద''నుకొంటూ.

ఒక్కొక్కసారి పిల్లలు యేడుస్తూ వచ్చేసరికి కొందరమ్మలక్కలతో కొలువుదీరి యంటుండా బిడ్డతల్లి. కుమార్తెను

దగ్గరకు తీసుకొని "అమ్మాయ్! నీవు రామారావుబావను చేసుకొంటావా? సుబ్బారావుబావను చేసుకుంటావా? వెంకటావ్రావుబావను చేసుకుంటావా చెప్పమ్మా!'' అంటూ ముసుసుకొంటారు. నిజానికి పసిపిల్లలు—పెళ్ళంటే యేమిటో వాళ్ళకేం తెలుస్తుందిచెప్పండి. పెళ్లంటె యెగిరెగిరి తలంబ్రాలు పోసుకొంటం—మేజువాణిలో పూ చెండులాడటమనుకొంటారు. అంచేత అమ్మావా ళ్ళడిగిన మాటకు సమాధానం, చేసుకుంటానంటే అందర్నీ చేసుకుంటానంటుంది — లేదా? యెవరినీ చేసుకోనంటుంది. కాకపోతే "నాకేబావకానీయిస్తే ఆబావను చేసుకుంటానం''టుంది. పక్కనున్న వాళ్లెవరయినా "మాఅబ్బాయినిచేసుకోవటే కోడలా!''అంటే "నాకే అత్తయ్య కాంపూస కొనిత్తే ఆఅత్తయ్యగారిబావను చేసు''కుంటా నంటుంది.

చూచారా యెంత తెలివితక్కువో? పెద్దవాళ్ళముద్దుకు వేరే మార్గాలు లేవా? కొన్నాళ్ళకాయమ్మాయి కొంచెం పెద్దదవుతూంది. ఏమైనాపుచ్చుట్టమో యికిలించుకొంటూ చతురులాడుతాడు. అమ్మాయి చిరాకు బడుతూంది. వెంటనే వాళ్లమ్మో, మరెవరోవుండి "అ—ఏమిటది? చిన్నపిల్లవుగదా అని చతురాడుకొంటే యిదిలించెయ్యాడమేనా?''అని మందలిస్తారు. చెతురాడేది చిన్నవాళ్ళతో గాకపోతే ముసిలాళ్ళతోనా?

చతురులో ప్రత్యేక చతురత లేకపోలేదు. హాస్యప్రసంగంలో చతురొక ప్రధాన భాగమే—

వాసనలేని పువ్వు ... పరిహాస ప్రసంగములేని వాక్యమున్
గ్రాసములేని కొల్వు కొరగానివి" .........
అన్నారు. హాస్యానికి అర్హతా, ఆధిక్యతావుంది. హాస్యమనే దేదో మేమిక్కడ చూపిస్తాం చూడండి.

ఒకచోట పదిమంది మాట్లాడుతున్నారు. అక్కడున్న వారిలో బావమరుదులుగూడా వున్నారు. బావగారికి అపాన వాయువు వస్తూంది. అది తెలియకుండా గడపలో కూర్చున్న వాడు కిరకిరలాడుతూన్న తలుపును వెనుకకూ ముందుకూ తిప్పాడు. ఇది బావమరిది గమనించాడు. "బావా! బావా! పుట్టు కిట్టులో కలిపావుకాని, వాసన దేంట్లోకలుపుతావయ్యా" అన్నాడు. అందరూ నవ్వారు.

వోయింటికో అల్లుడొచ్చేడు. ఆ సాయంత్రం స్నేహితు లంతా కలుసుకొన్నారు. అందులో వో స్వతంత్రుడు "ఓ హో హో—మిరప్పొడి చారు"అన్నాడు "మీరెప్పు డొచ్చారు?" అన్న మాటకు బదులుగా—వెంటనే "మిడిసి మీకంటబడినప్పు డ"ని అల్లుడుగారు సరిపోయేలా సమాధాన మిచ్చారు.

ఒకగ్రామంలో మేనమామా మేనల్లుళ్ళున్నారు. నిజానికి మేనల్లుడుకంటే మేనమామలే రెండుమూడు నెలలు చిన్నవా ళ్ళయినందున మొదటినుండీ వాళ్లు "ఏమిరాఅంటే యేమిరా!" అని పిలుసుకొంటుంటారు. ఒకనాడీ మేనల్లుడు మేనమామగా రింటికొచ్చేడు. మేనమామ ప్రాల్మాలికగానుండి; "ఒ రే య్! నీ వెలాగయినా మేనల్లుడివి—వరసలో చిన్నవయినా వయసుకు

పెద్దవాడివి — యింటికివచ్చిన చుట్టానికి — నీకు పనిచెప్పకూడదు కాని కాస్తలేచి ఆబల్లమీాది పుస్తకమిలా యివ్వరా!"అన్నాడు. అందుకు నేనల్లుడు; నీ వెలాగయినా మేనమామవు— వయసు లో చిన్నవయినా వరసలో పెద్దవాడవు—యింటికయిన కొమం దువి—నీవుచెప్పినపని నేనుకాదన కూడదుకాని కొంచెం నీవేలేచి తీసుకోరా అన్నాడు.

ఒకరినొకరు ప్రేమించి వివాహంచేసుకొన్న నూతన వధూవరులోనాడు సరదాగా మాట్లాడుకొంటున్నారు.

భార్య:- పెళ్ళికిముందు మీా వాళ్లు "మాకో యిల్లున్న దం"టే నే నేమోననుకొన్నా. నే ననుకొన్నంత పెద్దదికాదే—

భర్త:- పోనీ, మీా కామాత్రమయినా లేదుగా?

భార్య:- మాకెందుకు లేదండీ యిల్లు?

భర్త:- మీా కిల్లులేదని చెప్పావుకదూ?

భార్య:- మాకెందుకు యిల్లులేదండీ? మా నాన్నగారికిలేదుగాని యిద్దరూ నవ్వుకొన్నారు.

ఇవి సామాన్య చతుర ప్రసంగములు. పూర్వంలో కవితా చమత్కృతినిగూడా పరిశీలించుదాం. తెనాలి రామ లింగకవిని గురించి విననివారుండరు. కృష్ణరాయలు కవితా గోష్ఠి జరుపుచుండ వాని సవతితల్లి కుమారుడయిన తిరుమల రాయుడించుక అసూయ నొందువాడట. అతని నేత్రంబొకటి పువ్వుపూచినందున తిరుమలరాయు డేకాక్షుడని ప్రతీతి. అతని

కోరిక తీర్చెదనంచు తెనాలి రామకృష్ణకవి గ్రుడ్డి తిరుమలరాయుడు భార్యా సమేతముగా నున్నపుడిట్లు పద్యంబు చెప్పెనట.

కం॥ అన్నాతిగూడ హరుడవు
అన్నాతియె లేకయున్న నసుర గురుడవే,
అన్నా! తిరుమలరాయా!
కన్నొకటియు లేకయున్న కౌరవపతివే॥

చూడండీ! హాస్యకవి రామలింగ డిందెట్టి కవ్వించి నవ్వించే హాస్యాన్ని గుప్పించి, కుదిలించి, మూతి బిగించాడో యీ గోత్రాన్ని. "అన్నాతిగూడ హరుడవు" నీ ప్రక్కనున్న నీ భార్యతోగూడాచూచితే ఆమెకురెండున్నూ, నీకొకటి—వెరసి మూడు కళ్లు. మూడుకళ్లుగలవాడు శంకరుడుగాన నీవు యీశ్వరుడవు. "అన్నాతియె లేకయున్న నసుర గురుడవే" నీ భార్య నీ లెక్కనుండి తొలగించితే నీకొక ఒకకన్ను కాబట్టి వొకకన్ను గలవాడు "అసురగురుడు" రాక్షస గురువయిన శుక్రాచార్యుడవు. ఓ తిరుమలరాయా! "కన్నొకటియు లేకయున్న కౌరవపతివే" యిపుడున్న యీ యొకకన్నుగూడా లేకపోయినచో రెండు కళ్లూలేని ధృతరాష్ట్రుడవని యిందలి భావము.

హాస్యమంటే అదికాని యిదికాదు. ఇది నిర్మలహృదయాలను నీతివిహీనుల జేయుటకు మార్గము. విన్నారూ? ఓ చోట పదిమంధాడవాళ్లు హాయిగా భోంచేసి కూచున్నారు. అందులో వొకతల్లికి బద్ధకంగావుండి కాస్తనడుము వాల్చాలను

కుంది. ఆమెకు మెడతిరిగితే తలతిరగదు—తలతిరిగితే మెడతిర గదు. అలాంటి పరిస్థితిలో ఆమెకు తలక్రింద దిండుకావలసొచ్చి వచ్చింది. ఇంతలో తనకు కనపడిన మేనల్లుడు వరసకావలసిన వకకుఱ్ఱాడ్ని పిలిచి "ఒరేయ్, అల్లుడా! నీకు నాకూతురును ఇస్తా నుకాని, గదిలోనున్నదిండు కాస్త తెచ్చియ్యరా"అంది.

''నేనుతీసుకరాను''అని ఆకుఱ్ఱాడు బదులుపలికేడు "నే నత్తనుగదూ? నామాటయినకపోతే రేపునీకు పిల్లనివ్వ"నని మరలా అన్నది.

"నీవిచ్చినా నీకూతురు నాకక్కరలేదన్నాడుమళ్లీ —

"అబ్బా! ఏమయ్యా! పిలిచి పిల్లనిస్తామంటే" యెత్తికుదే యమన్నటులుంది. అనియిరుగుపొరుగమ్మలక్కలనగా తిరిగి యీకుఱ్ఱాడు ''అదిగాదుపిన్నీ! యీాయత్తయ్యకుంది వక్కగా వక్కకూతురు. ఇవ్వేళదిండుతెచ్చిఇస్తే నాకు తనకూతురునిస్తా నన్నదికదా? మరి, అలాంటిఅత్తగారు బట్టలు బాగావుతికితే చాకలికి తనకూతురునిస్తానని చెప్పియుండవచ్చు. మంచికుండలు తెస్తే కుమ్మరికిస్తానని చెప్పియుండవచ్చు—మామగారికి క్షౌరం నున్నగాచేస్తే మంగలికిగూడా యీకూతునే యిస్తాననొచ్చు. ఇలా యెంతమందికీ అమ్మాయిని ముడుపుగట్టిందో, కాస్తదిండు గదిలోనుంచి తెచ్చియిస్తే నాకూ యిస్తానన్నది. అందుకని యింత మంది పేరుపెట్టినపిల్ల నాకెందుకాఅని అక్కర్లేద"న్నానంటూ? స మాధానం చెప్పంగానే అందరి నోళ్ళకూ తాళ్లాలుపడి ముక్కు-

మీద వేస్తేసుకున్నారు. ఆరోజు మొదలాతల్లి పాపమీలాంటి మాటలన్నపాపాన పోలేదు. ఆకుఱ్ఱాడు చిన్నాడయినా మంచి నీతి నేర్పాడు అతడు "చిరంజీవి"అన్నాం కాబట్టి మేమూలాంటి బాలబాలికలకు ప్రేమాశీస్సు లిస్తున్నాం. ఇస్తాం.—

చూచారూ! కన్యాదాతల విషయం కాస్త ప్రత్యేకంగా పరిశీలించిచూద్దాం. ఈపెళ్లిళ్లలోపెట్టే విపరీతఖర్చులలో మొట్ట మొదటిది కట్నాలప్రశంశ. కట్నమనేది కన్యాదాతకు కంఠపురి. ''కట్నాలపిశాచాన్ని కడదేర్చండి''అంటూ కంఠంబద్దలు చేసి కొంటూ గద్దెలమీదికెక్కి పెద్దపెద్ద మహోపన్యాసాలనిచ్చే వో దేశోద్ధారకునిచూచి మరో ఆడబిడ్డలగన్నతండ్రి కొండంత యడియాసతో చేతులెత్తి నమస్కరించి ''అయ్యా! కట్నాల దురాచారాన్ని కన్నెత్తైనాచూడన"ని ఖండితంగా చెప్పగల పుణ్యాత్ముని మిమ్ము నేటికిచూచాను. నేనుగూడా మీలాంటి దేశగౌరవాభిమానిని, "యిట్టిసందర్భములో వరవిక్రయనిషేధ విధానాన్ని మనమే తొలిసారిగా అనుసరించుదామని కోరుతూ మీయబ్బాయిగార్కి మాఅమ్మాయి నిద్దామనుకుంటున్నాను" అని అనగా శ్రీయుపన్యాస చక్రవర్తిగారు "అవునండి, తమ కోరెక తప్పక శ్లాఘాపాత్రమే. నాకూ అదేయిష్టం. అయితే మాయింట్లోవాళ్లెవరూ దానికంగీకరించేవాళ్లుకారు. దానికి తోడు మావాడుకూడా నామాటవినడు, పాపం — మీ యభిలాష తీర్చలేను మన్నించండి'' అంటూ కాసునడపమని డ్రైవరుకు సిగ్నలుయిచ్చాడు. "పేదవానికి పేరాశమెండ''నినట్లు

మన దురదృష్టవంతుడికి కింకను నమ్మకము పోలేదు. కారుమీాద వెళ్ళేవాడ్ని కళ్ళతోచూస్తూ కాళ్ళతో నడిచాడు. ముందు కార్యక్రమంలో అనుకున్నా డాపెద్దమనిషిని. తుట్టతుదకు తెలుసుకున్నా డీస్వానుభవపరుడు. బురఖాప్రచారకుల బూటకాలు. అందుకే బిళ్ళను గళానితో దామోదరు డిలాఅన్నాడు.

కం॥ ఇతరులకు ముందుదెల్పగ
ప్రతివాడును వైద్యశాస్త్ర పారంగతుడే
యితరులకు నీతిదెల్పగ
ప్రతివాడును ధర్మశాస్త్ర పరిపూర్ణుండే!

అని—

చివరి కేంచేస్తాడుపాపం. విధిలేని కర్మమాఅంటు వరకట్నమివ్వటానికి కంగీకరించకపోతే ఆడపిల్ల నలాయింట్లోపెట్టుకోంటాడామరి ? పూర్వ్వలార్జించింది కాస్తాఅమ్మి కూతురుమెడలో పుస్తెకట్టించాడు. అమ్మాయి కాపరానికి పోయేసరికియన దీప మారిపోయింది. అంచాత పూరిడిచిపోయి నాలుగుచెంగులు ముడివేసికొని భిక్షాటన చేయదగిన స్థితివచ్చింది,

ఇంతజరిగినా అల్లుడి కేమైన జానికలిగిందా? మామగారి మా లెనవరైన బైటకు తె స్తేచాలు. ఆయనగారిమీాదలేని ప్రచార

మారంభిస్తాడు. అందుకనే శాబోలు యేదయినా సందర్భం వచ్చినపుడు "పాపం ఆడపిల్లలతండ్రిని కనిపెట్టి చూడండిరా" అనిపరిపాటిగా అంటుంటారు. అందుకనే అతనుకూడా యిన్నా రెన్ను పాలసీలోకూడా "మ్యారేజీ యెంగేజ్ మెంటు" అనే భీమానద్ధతి ననుసరించి యిటీవలగా అమలులోనికొచ్చినదారినే త్రొక్కటం జరుగుతూంది

భార్యకు నెలతప్పిందంటే భర్తగుండెల్లో గాలాం పడుతూంది. "ఆడపిల్లా? మగపిల్లాడా"అనే ఆసందేహం తీరక; అందాకా మనసాగక "నాకుపుట్టేది కొడుకా? కూతురా?" అంటూ చీటీలురాసి లాటరీలుకూడా వేసుకొనేవాళ్ళుంటారని కూడా చెప్పొచ్చు. ఆ లాటరీ మోసగాళ్ళీ యమాయకుడిని వోమారు కొండమీదికెక్కిస్తాడు - మరోమారు గోతిలోకి చెడతాడు.

గదిలో పెళ్ళాం ప్రసవనొప్పులు పడుతూంటుంది. గడపలో పెనిమిటి ప్రశ్నభాగాలు చూస్తుంటాడు. మంత్రసాని నోటినుంచి యేమాట యింటానోనని మదనపడుతూంటాడు. గడిదీసిన చప్పుడయితే గుటకలుమింగుతూ వార్తాహారుల వాక్యార్థం వీక్షిస్తూ "మహాత్మా! నాకు జెప్పంగదే"అన్నట్లు వారిమొగాలు చూస్తారు. ఆమహాతల్లి "మగపిల్లాడ"న్నదా అందరూ మహాదృష్టసంపన్నులే. "ఆడపిల్ల"న్నదా అమాంతంగా మింగినంత రౌద్రంవచ్చి "కోరలుతీసిన కోడెత్రాచు నయ్యానురాబాబూ" అనుకొని చాపమీదచతికిల బడతాడు.

కొంతమంది తండ్రులు కడుపునపుట్టినపిల్లల నెత్తుకోరు, దగ్గరకూ పిలవరు, అథవా పిల్లలేవచ్చినప్పటికీ తండ్రులేఅక్కడ స్థాన సన్యాసం గావిస్తారు. ఇందుకు కారణమేమిటంటారు? కొందరికి సిగ్గు — కొందరికి "అప్పుడే తండ్రిఅయాడా అని లోకు లనుకుంటారేమో"ననే భయం — కొందరికి ఆడపిల్ల గలిగిందన్న కొరత — బహుశా ఆడపిల్లనుగన్న పెళ్ళాంమీద పోట్లాటపెట్టుకొని అలిగిపోయే మగాడుగూడా వున్నాడేమో చెప్పలేము. భగవంతుడు ప్రసాదించినదానికి భార్యమాత్రం యేంచేస్తుంది? ఆమాటకొస్తే ఆడపిల్లలను కనే సందర్భంలో భార్యతోబాటు భర్తగూడా తప్పచేసినవాడేగదా?

ఇలాకన్నబిడ్డల నెత్తుకోకుండా సిగ్గుబడేతండ్రులను చూస్తే నాకో కథ జ్ఞాపతమొస్తుంది, వెనుకోనాడు శంకరుడు పార్వతితోడను, విఘ్నేశ్వరాది కుమారులతోడను, నంది మున్నగు భృంగులతోడను, సురముని ప్రముఖ కవి గాయక నృత్యకైవారాది బృందములతో నిండియుండిన తన కొలువుకూటమునందు శనేశ్వరునిగాంచి "ఓయీ! శనిదేవా! నీ వింతటి ప్రజ్ఞాశాలివిగదా-నురినన్నుబట్టి నీశక్తిచూవగలవా?" యని ప్రశ్నింప — శనిలేచి "మహాత్మా! తమ శెలవయిన నాకీపనియొక అబ్బురమా?" యనెనట. అందులకా పరమ శివుడాగ్రహించి "ఏమీ! నన్నునూ బట్టగలవా? అయిన నానిర్ణీతసమయ మెప్పుడో చెప్పుమని" హుంకరింప తిరిగి శనేశ్వరుడు స్వామీ! మీయాజ్ఞ అయినచో రేపటిరోజున

సాయంత్రి మేడెనిమిది ఘామురలో తమ్ముపట్టెదనని దెలిపెను.

మరునాడందరును శనేశ్వరెట్లు శంకరునిబట్టునో చూత మనిదలంచి దేవతలందరు తమతమ వాహనంబులనెక్కి— భార్యాపిల్లలతో విలాసంబున నాకసమందు నిలిచి చూచుచుండిరి. ఈశ్వరున కాసమయము సమీపించుచున్న కొలది "శని తన్నావరించునేమొ? సాటివారలలో చిన్నతనముగనుండునేమొ"నని శంకించి ముందుగనే నిర్ణయించుకొనిన ప్రకారమా శనికాల మంతయును దాగవలయునని ఒక మఱ్ఱిచెట్టులో నొదిగినొదిగి కూరుచుండెను. సమయము దాటిపోయిన పిమ్మట వెలికివచ్చి "శనీ! నన్ను స్పృశించుట నీశక్యమా? అనెను, అపుడా శనేశ్వరుడు నమస్కరించి" స్వామీ! ఇందరు మహనీయు లిటులిందు విలాసంబుగ విహరించుచుండ మీరు కైలాసమును— మాతల్లి గౌరిదేవిని విడిచి యీచింతచెట్టు తొఱ్ఱలో రొండలు చిల్లులువడ కూర్చుండుట శనిబట్టిగదా?" యనెనట ఆడపిల్లని కన్నదని ఆలిమీద అలిగేవారిని—చిన్నతనంలో పిల్లలాయని చీదరించుకొనేవారినిచూస్తే మాకాకథ గురుతొస్తుంది. లక్షణంగపుట్టిన బిడ్డలను సలక్షణంగ పెంచుకోకపోవట మేమిటంటారు ?

"అరయన్ వంశము నిల్పనేకదవివాహంబ"న్నట్టు, పెళ్లి చేసుకొన్నందులకు పిల్లల కవట మొక సఫలకార్యమొకదా? అందుకన్నే కొత్తగ పెళ్ళయినవారినిచూచి. స్వతంత్రముగల

వారొకొక్కప్పుడు సరదాగ" పెళ్ళికాగానే సరికాదురా, పెళ్లి కొడుకా గబగబ నలుగురుపిల్లలు పుట్టాకగాని పెళ్ళి సంబరం తెలియదంటారు చూడండీ! పవిత్రమయిన అగ్ని యెదుట సేయు ప్రమాణ మేమిటి? "సకుటుంబ క్షేమ". మనువాక్యంలో సంతా నమున్నటులు గూడా అర్థమున్నదికదా, ఆసిగ్గు తెలియని వారికి ఈసిగ్గు ఎందుకో? అలాంటివారు పెండిలాడుట మాత్ర మెందులకు?

న్యాయంగ కొద్దిమంది వివాహమాడటంలో అర్థంలేదు. వారికి నలువురితో బాటు పెళ్లికాలేదంటే నగుబాటుగతోస్తుంది తనకు భార్యలేదంటే తలవంపులనుకొంటారు. పెళ్ళామంటే కేవలం పనిపాటల నుపయోగించే దాసి అనుకొంటారే గాని కామభోగాలలోను భాగస్తురాలని — కాపురం నిలవబెట్టుకొన టంలో సహకారిణి యని తలంపరు. అలాంటివా రింటిపనులకే పోరుగమ్మ గన్నబిడ్డను వివాహపు తంతుతో ముడిబెట్టుకొని దానిగొంతు కోయకపోతే ఆ నాయనమ్మల తలకాయలు పట్టు కొని యెవరేడ్చారు? ఇంత తిండి పడకెయ్యటానికే ముసల మ్మలో దొరకరా? కాకపోతే మరోమార్గం కనుపించదా?

వార లసలు నపుంసకులు. దానికేవరేం చేస్తాం? ఆగుట్టు యిన బైటకురాకుండ యేదో కారణంతో వివాహం విరమించు కోరాదా? అలాగైతే వానికి మగతనం లేనటులు లోకులు పరిహాసిస్తారని భయపడి వారు సమర్థిస్తున్నారా? అది మరీ పొరపాటని మేమంటున్నాం.

పైకి డాబుసరిగ పెళ్ళి చేసుకొన్నాడు. ప్రాయము వచ్చినభార్య ప్రక్కకువచ్చింది. పతి సంపర్కంకొరకు పరితపించింది. మదనవేదనతో క్రుంగిపోయింది. అభిమానానికి ఆ వేదన పడింది. ఎన్నాళ్లీ విరహామనుభవిస్తుంది? మనసులోపొంగే మమకారమెలా మాటుపెట్టుకొని మసలుకొంటుంది? ఎప్పుడో వొకపుడు భర్తను స్వాయముగ బంధిస్తుంది. అప్పుడయ్యగారి సత్తా అర్థమౌతుంది. ఇక జరిగేదేమిటి? భార్యకు భర్తమీద ద్వేషం ప్రబలుతుంది. "ఇలాంటివాడవు నన్నెందుకు చేసుకోవాలా?" అంటుంది. ఆంతకంటే మొదటనే పెళ్ళిమానుకొంటే అదో అందంకదూ?

మళ్ళీపెళ్ళి మగువలు చేసికొనటం మనవారికి చాలా తప్పు. పరపురుషుని పొందు పాపభూయిష్టం. ఇంటిలో సుఖంయింతైనలేదు. మరేంచెయ్యాలి? భారతం మనకు పంచమవేదమయినను. గాంధారి, కుంతి, మాద్రి, ద్రౌపదులు మనకు పూజనీయులయినను యీవిషయములలో మాత్రము మనస్త్రీలు వారి ననుసరించరాదు. మరెలాగండి పీరిక్షర్మం?

మనవాళ్ళందుకే మరో యెత్తువేశారు. పుంసత్వము లేనివానికి తనభార్య అవినీతికి పాల్పడక తప్పదని ముందుగనే నిర్ణయించుకొంటాడు. అవినీతి నరికట్టేమార్గ మవలోకిస్తాడు. కడుపునిండ భోజనం పెట్టకపోతే కామోద్రేకం కలగదని తలుస్తారు. అందుకని యింటిలో పప్పు, ఉప్పు, బియ్యాలన్ని కొలిచి

యిచ్చి—యెదురుగావుండి వండించుకొని—ముందు తాను పొట్టనిండా తింటూ గిన్నెలోచూస్తారు. అడుగున అర్ధాన్నమే వుండాలి. పెళ్ళామూ సగమన్నం తింటేగాని ప్రాణాలుపోకుండా; పస కలుగకుండా ఉండదని వారిభావం. ఓ వేళ భార్యకు సరిపో నన్నం మిగిలితే కష్టపడి తానే మరోముద్ద తింటానంటాడు. అలా తినలేకపోయినపుడు బజారులో కుక్కనైన పిలిచి తన భార్యవంక "నాకు తిండి చాలదో దేవుడా" యని మొత్తు కొనుచున్నను భూతదయ చూపిస్తాడు. ఆ భూతదయే నిజమ యితే వీధికుక్కమీద వుండేజాలి యింటియిల్లాలిమీద వెందు కుండదా అని?

ఇలాంటివారిని మేము భాగ్యవంతులలో కొందరిని చూచాం. ఒక మహానుభావుడు చాలావరకు భాగ్యవంతుడే. ఆతను వానిభార్యకు బంగారం వజ్రాన్నము—గాళ్ళ నెక్ లెస్ చేతిగాజులు చేయించాడు. విలువైన పట్టుచీరెలు—జలతారు చీరెలు కొన్నాడు. పూలు, ఫేసుపౌడరు, తిలకం అన్నీ తెప్పిం చాడు. అయితే ఆయింటిలో ఒక మరతున్నది. తనభార్య యివన్ని చూచి యానందించవలయునేకాని అనుభవించరాదు. అవునుమరి?—ఆయనభార్యను చూచి ఆనందిస్తున్నాడే కాని అనుభవిస్తున్నాడా?

ఆలాగేత నపెళ్ళామీద యలంకారం చేసుకోవాలంటే ఆయింటిలో మూడవవ్యక్తి యెవరు వుండకూడదు. తలుపు లన్ని తాళాలతో బంధించాలి. అప్పుడు తాను తెచ్చిన

సొమ్ములు. చీరెలు, సింగారించుకోవాలి. ఆ వేషంతో
బైటకు పోరాదు. పొరపాటుగనైన యితరులు చూడరాదు.
తిరిగి ఆమె వీధిలోనికి వెళ్ళవలయునన్నచో యీవస్త్ర భూష
ణములన్నియు తీసి—పౌడరు రుద్ది తిలకం దిద్దిన ముఖం గట్టిగ
కడిగి తేనే కాని ఆమె యీసుఖ చెరసాలనుండి బైటకు రావీలు
కలిగించడా మగడనే జైలధికారి.

ఉట్టికెక్కలేనమ్మ స్వర్గానికి యెక్కిందన్నట్టులే మహాను
భావులు యింట గెలవలేక పోయిప్పటికిని రచ్చల కువస్తారు
గెలవాలని. భార్యఅంటే భరింపబడేదని మాత్రం వారికి
తెలుసు. భర్తంటే భరించేవాడని కూడ తెలుసు. ఈ తెలిసీ
తెలియని అర్ధపాండిత్యమే వారికలాచేస్తుంది. కాకపోతే భర్త
గారి యధికారమెంతవరకు? దానిని గమనించగల విచక్షణా
జ్ఞానమున్నదా? తెలియక భార్య పొరపాటుచేస్తే తెలియచెప్ప
వచ్చు—చెప్పినావినకపోతే చివాట్లు వెయ్యవచ్చు—అంతకూ
వ్యతిరేకిస్తే అవసరమయిన దండన విధించవచ్చు. కాదని యెవ
రంటారు? కాదని యెవరయినాఅంటే మాత్రమది సమంజస
మని పెద్ద లొప్పుకొంటారా?

"అపక్వాహారం విషం" అనినట్టులా యిల్లాలికీ కాపు
రమూ మరింత వ్యసనముకదా? ఇన్నియుండియు నలువురిలో
నేనుకూడ కలిసి తిరగక లేకపోతినే యను విచార మామెకు
తీరునా? ఒకొక్కప్పుడీ సంసారములు వారికి జీవితాలపై విరక్తిని
కలిగించి ఆత్మహత్యకు పాలుసేయవా?

పూర్వకాలంలో పెళ్ళిళ్ళు యెనిమిదిరకాలుండేవి. వాటిల్లో స్వయంవరం; రాక్షసం; గాంధర్వం తరచు చూస్తున్నాం, వింటున్నాం. కాని యీ కలికాల మహాత్మ్యంలో తొమ్మిదో రకం వివాహం బయలుదేరి బ్రహ్మాండంగా పెరిగిపోయింది. దీనినే నిబంధనా వివాహం అనాలి.

సామాన్యంగా యీరోజుల్లో పిల్లకావాలని యెతికే వారికంటె పిల్లవాడు కావాలని యెతికేవారే యెక్కువనుంద కదండీ! ఓబాకీదారు డోయింటికామందులవాడిని నిలువవేసి బాకీకట్టమంటే ఆయనగారు వినయ విధేయతలతో "అయ్యా! ఆగినన్నాళ్ళు ఆగారు — జరిగినన్నాళ్ళు జరుగవు — యీయేడు మీరిమ్మనమన్నా యివ్వలేను — వచ్చేయేడు మీరొద్దన్నా వుంచను. కాస్త దయయుంచి యీ నాలుగురోజులు కళ్లుమూసుకొండి" అంటే, "వచ్చేసంవత్సరమయినా యిస్తానని నమ్మకంయెలా?" అని తిరిగి మొదటతనడుగగా "వచ్చేసంవత్సరం మాఅబ్బాయి పెళ్ళిచేస్తాను. డబ్బొస్తుంద"ని ఋణపడ్డవ్యక్తి రొమ్మువిరిచి మాటాడాడంట. అందుపై మధ్యవచ్చిన పెద్దమనిషొకాయన "అదేమిటండీ! కార్యంచేసినవాడు కష్టపడబడియుంటాడుగదా; పెళ్లిచేస్తే పైకం కర్చా? జమా? బాకీతీర్చుతానని బాహాటంగా చెప్పుతున్నారనగా" తిరిగి బాకీదారుడు "అదికాదు నాయనమ్మా! అయిదువేల రూపాయల కట్నం అణాలుకొదువలేకుండా వొస్తుంది. రెండువేలు పెళ్ళికర్చులు — వెయ్యన్నరపాతబాకీలు—అరవెయ్యి అవసరపుపనులు

న్న వెయ్యిరూపాయలు బ్యాంకీలో వెయ్యటానికి నిన్ననే బడ్జెటు తయారుచేశానని ఘరానాగా సమాధానం సెలవిచ్చారట.

అలాంటివారికి డబ్బవసరమయినపుడుమాత్రం పైబెట్టు తగ్గకపోయినా లోలోపలమాత్రం కొద్దిగా విచారిస్తుంటారు. అటో పెళ్ళిళ్ళపేరయ్య; యిటో వివాహాలవీరయ్య తయారయి తారు. వాకబుచేయటానికి బయలుదేరుతూ ముందుగా "వినాయకా! విఘ్నేశ్వరా! అంటూ విఘ్నపతిని తలుస్తారు మాంచి సంబంధంవచ్చి మాముందు వ్రాలాలాఅంటూ;" వెధవముండకు దండంపెడితే నామాదిరే వర్ధిల్లుమంటూ దీవించినట్లు వినాయకుడే పెళ్ళిలేక పేరుబ్రహ్మచారైపోతే వీళ్ళకేమి సంబంధం తెస్తాడు.

కార్యాలన్నీ యేదో కాస్తకాస్తగానైనా మాటామంచికీ మధ్య కొందరుండాలిగా? — వాళ్ళలో చాలామందికి వాళ్ళ మాటాడేదేమిటో వాళ్ళకే తెలీదు. యితరులు మాటాడేదేమి తెలుస్తుంది? అసలు తెలియాలిసిన పనిమాత్రమేముంది? పెళ్ళి యెలాగయితే వారికేం? వారికికావలసింది పెత్తనం. పెళ్ళిపెత్తనమంటే పైసగుక్కేసుకొని పిచ్చాళ్లుకొట్టడమే ననుకొన్న వోమధ్యవర్తి మరోపిల్లతండ్రితో యిలామాటాడాడు.

తండ్రి :- అయితే భూస్థితి యేమైనా......?

మధ్యవర్తి :- ఏమయినా వుందాఅని చిన్నగా అడుగుతారా? సదియకరాల మెట్టభూమిగల పక్కారైతండోయ్!

ఈరోజున అమ్మాలంటేమాత్రం యెకరం యేడువేలుపెట్టియినా యెవడండేవాడే యెగరేసుకపోంటాడు. సుక్షేత్రంలాంటిభూమి చూస్తే వదిలిపెడతారటండీ! నామాటంటే నమ్మా — నమ్మకపో! నల్లబంగారమంటే వొప్పుకో. —

తండ్రి :- అన్నదమ్ములు?

మధ్య :- అబ్బే! ఎంతమందైతో యెక్కడిది? అయిదుగుర — అయిదుగురంటే అయిదుగురె. అందులో మనల్లుడే పెద్దవాడుగూడా.

తండ్రి :- అబ్బా!

మధ్య :- అయితేమటుకేమయ్యా. అసలు నన్నడిగితే యీరోజుల్లో ఆస్తివిషయమనేది మనకనవసరమంటాను. పిల్లవాడెంతయోగ్యుడు — ఫస్టుక్లాసులో బి.ఎ. ప్యాసయాడు.

తండ్రి :- ఆ! యీరోజుల్లో చదువులకేమిలే, మూలనున్న మూడుకాళ్ళముసలమ్మలు చదువుతున్నారు. చదవంగానే సరా? చదివినంతగా ఉద్యోగం సంపాదించొద్దూ?

మధ్య :- ఉద్యోగం లేకపోవడమేమిటి? యం.ఎ. చదివినవాళ్ళకులేనిభాగ్యం మనవాడు బి.ఎ.తోనేకొట్టేశాడు. ప్రమోషన్ కావడానికికూడా చాలాహోప్స్ వుందాయె.

తండ్రి :- జీతమెంతుంటుందంటావు?

మధ్య :- జీతంమాట మనకెందుకండీ; ముష్టిజీతం. ఈ కాలంలో చూడాలిసింది జీతంకాదు, జీలకఱ్ఱాకాదు — పై

సంపాదన — పలుకుబడి. పసవాడు మానందాల్చాలకాని, వొక్క నిమిషంలో వందరూపాయలు రాలవ్వూ? వందరూపాయలు. మీకాసందేహం యేమాత్రంగూడా అక్కర్లేదన్నానుగా? ఆవిషయం స్వయంగా నన్నడుగు. నేనుచెప్తున్నాను. మునిసిపాలిటీలో నౌకరీ అంటే మా మొనగాండ్లకు దొరకటం లేదని తెలీసూ?

తండ్రి :- మీరుచెప్తే నేను మళ్లీమాటాడుతానా?

మధ్య :- ఆఁ అదే —

తండ్రి :- అదేగాని —

మధ్య : మళ్లీ కానీ తెచ్చిపెట్టా రేమిటండీ! కట్నంమాటే దో నాచెవులో వెయ్యక —

తండ్రి :- అయితే గిట్టుబాటుగల నౌక రేఅంటారా?

మధ్య :- అయ్యో· లేకపోనడ నేమిటిలండీ! పెట్టినప్పట్టివ వాడు — పట్టుమని మంచిపోష్టు దొరికింది.

తండ్రి :- అయితే ఆనౌకరీచూచే యిప్పుడు పిల్లనివ్వాటమన్న మాట! ఉమ్మడినఉంటే కొంత కమ్మికగా వుందిగాని, పంచుకొంటే యేమొస్తుంది. తండ్రికికూడా భాగముంటే మరీ తగ్గిపోతుందామె.

మధ్య :- ఏదోకొంత నిలవడబ్బుకూడా వుందంటారు.

తండ్రి :- ఏమోలే, యెంతుందీ, లేనిదీ యెవరుచూచారూ? బాకీలేమో — చాకీలేమో?

మధ్య:—బాకీలు లేవు—బాడలు లేవు. నీకంత అనుమానంగ వుంటె నిర్మొగమాటంగ చెప్పు. వాళ్ళకు పిల్ల దొర కదా? మీకు పిల్లాడు దొరకడా? నాకు పప్పన్న మెలా గయిన నమ్మకమేనాయె.

తండ్రి:—ఆమాట నిజమేలెండి, మరింతకు కట్నాలు మనం భరించేలాగున్నామా లేదా అని విచారించుకోవద్దూ? అయినా వారెంతలో వున్నారంటారు?

మధ్య:—ఎంతేమిటి? మునిసిపాలిటిలో నౌకరంటే మూడు వేల యినా లేనిద చేసుకుంటారా? ఆపైన యేదో.....

తండ్రి:—అంత భరించటం కష్టమండి.

మధ్య:—అయితే నీయిష్టం.

తండ్రి:—ఆగండి. రెండు వేలిద్దాం. కట్నమిచ్చినా, కన్నె నిచ్చినా చదువులుచూచికాని సంపద చూపకాదుగద?

మధ్య:—నిజమె. ఉన్నవారికి నీవెంత కట్నమిచ్చినా నిన్ను ఉట్టికీ స్వర్గానికీ యెక్కనీయరు. లేనివాడికా కట్నమిస్తే లక్షణంగ నీపేరు చెప్పుకొని బాగుపడతాడు.

తండ్రి:—సరే నా మాటప్రకారం సరిచెయ్యండి. మీ మేలు మరచిపోను.

మధ్య:—మీారంతగ కోరుతున్నారు కాబట్టి నా శక్తిని ధార వోసి ఆసంబంధం మీాకు ఖాయంచేయిస్తాను. మరియింక ముసుగులో గుద్దులాట లెందుకుగాని నా మామూలు మాటగూడా కాస్త చెవున వేద్దూ. విని వెళ్ళావంటే విజయ సమేతంగ వస్తాను.

తండ్రి:—దానికేం? ఏదో మాటాడుదాం లెండి.

మధ్య:—మీా రనుకొన్న దేదో సెలవివ్వండి.

తండ్రి:—మీా మామూలు చెప్పండి యెలాగో?

మధ్య:—దీని కింతాలోచనా? మొన్న ముత్యాలపాటి వారు మొత్తం వెయ్యన్నర రూపాయలదాకా నాకు ముట్ట చెప్పారు, అంటే అది చాలా గొప్పస్థితి అనుకొండి. తమ విషయంలో తకరాలు లేకుండా అయిదువందల రూపాయ లిస్తే అంతా కుదిరిపోతుంది.

తండ్రి;—అమ్మయ్యో! ఐదువందలే?

మధ్య:—నాకిచ్చే అయిదువందలు నష్టం కావండోయ్! నేనే యీసంబంధం రెండువేలకు కుదర్చకపోతే మార్కెట్టుకు మీారుపోయి అయిదువేల అయిదువందలకు తక్కువ కట్నంతో అల్లుడ్ని తీసుకరండి చూద్దాం. యెలా తీసుకొస్తారో?

తండ్రి:—అయ్యావారి గారిముద్ర బుజంతప్పిన నీవు తప్పన్నట్లు అల్లుడి కట్నంతగ్గిన పెళ్ళికట్నం తగ్గేలాలేదే! అయితే రేపురండి అన్నీ సంగతులు తేలుద్దాం.

తరువాత మనుముల బ్రోకరు వెళ్ళాడనుకోండి. ఆతరువాత ఆయనగారు పిల్లవాని తండ్రిదగ్గరకు పోయి లంచం యుద్యోగ లక్షణం" అన్నట్లు నాటకాలాడుతా డనటం వింతేమున్నదండీ!

బాబూ! ఈవిధంగా చెప్పాలంటే యెన్నో వున్నై. వివాహమంటె యేమిటో? వివాహ భావబంధము లేమిటో? వివాహ విధానమేమిటో? అన్నిటికంటె ముఖ్యము వైవాహికముయొక్క విలువను సామాన్యులు గమనించుట లేదు. అది ప్రతివారికివాంఛనీయము—అత్యావశ్యము—ఆర్యనిర్మాణము.

ఆవిషయము లన్నియు రేపు రెండవభాగములో మీకు మనవిచేస్తాం. పెళ్ళిళ్ళు—పెళ్ళిళ్ళ విధానములుమాత్ర మీనాడు చలోక్తిగ మాటాడుకొన్నాం. కథాక్రమమును చేరకుండనే యీనాడు మనము ముందొక యుపోద్ఘాతములో కాలము పూర్తిచేస్తున్నాం. రెండవభాగములో మీకుకొముచ్చటించేవివికావు. వివాహమంటే యేమిటి? వేదభావ మేమిటి? మంత్రాలేమిటి? సూత్రాలేమిటి వనేవాటిని వేదోక్తముగ—విశ్రాంతిగ—విశేష వివరముగ మనవిచేస్తాం మరొక సమావేశంలో

మంత్రము—మంత్రమునకున్న అర్థము—అర్థమునకర్హమైన యాచారము—ఆచారమునకిపుడు పట్టిన మనవారి గ్రహచారము—గ్రహచారమునకు చేయదగిన విచారణలన్ని రేపు తెలిసికొందురు కాన ప్రపంచమునగల ప్రతియొక్క స్త్రీ పురుషులు తప్పక పెళ్ళిళ్ళు రెండవభాగములో నన్ను—నాతో గూడ నా కవిమిత్రుడు నాగశ్రీని తప్పక కలుసుకొండని కోరుచున్నాను—కోరుతూ నేటికీమాటలు ముగించుచున్నాను—ముగించుతూ మీవద్ద సెలవు పుచ్చుకుంటున్నాను.

జైహింద్.

ఇట్లు మీ॰ స్నేహితుడు,

దరిశి వీరరాఘవస్వామి,

వాసుదేవ సదనం,

సాలిపేట 2 లైను, అరండల్ పేట పోస్టు,

గుంటూరు - 2.